శ్రీమ ద్రమారమణ గోవిందో హరిః

# శ్రీ రామదండు.

TPLA129B130




రామదాసు - ఆంధ్రరత్న

## దుగ్గిరాల గోపాలకృష్ణయ్య.

శ్రీ

# రామదండు




శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠి,

విజయవాడ.

శ్రీభావనామసంవత్సర వైశాఖమాసము.


సర్వస్వామ్యసంకలితము.]

[వెల రు 0-8-0.

# పీఠిక

శ్రీ గోపాలకృష్ణుఁడు నవీన రామదాసుడు. శ్రీరాము డాతని కిష్టదైవము. ఆతడు సర్వకార్యములను శ్రీరామనామముతో సమన్వయము జేయుచుండెడివాఁడు. గ్రామసంకల్పము జేసి రామనగరు కట్టనెంచెను. శ్రీరామాలయముల కై యాతని యసువుల ధారవోసెను. జెండా హనుమద్ధ్వజము. రశీదులు రామరశీదులు. ఆతనికి ధర్మకార్యము లన్నియు రామకార్యములే. తుదకు "స్వరాజ్యము" కూడ రామరాజ్యమనియు, తెనుగుభాషలో "రామ" శబ్దమునకు "రా" యనగా "రాముఁడ" నియు "మ" అనగా "మనది" అనియు గూడ చలోక్తిగ ననెడివాడు. "అంతా రామమయ" మ్మను నార్యోక్తి శ్రీగోపాలకృష్ణునియెడ నన్వయించిన విధమున నవీన కాలమందు మరెవ్వని యందును అన్వయించుట, కని, విని, యెఱుగము.

ఇట్టి భక్తాగ్రేసరుఁడగు గోపాలకృష్ణుఁడు శ్రీరామకార్యమని యెంచిన స్వరాజ్యయత్నమున సేవాదళముల సమకూర్చు సమయమున "శ్రీరామదండు" అను నాంధ్రసాంప్రదాయానుబద్ధమగు దళములను సమకూర్చుటయం దెట్టి యాశ్చర్యమును లేదు. ఆత డీ "రామదండును" గూర్చి వివిధసమయములందు వివిధరీతుల నాంధ్రమహాజనులకు 'బహుపరాక్' అను హెచ్చరికలను జేయుచు తానే యట్టి దళములను నిర్మించి వారిని తన చీరాల రంగమందు నడుపుటయే గాక యేతల్లక్ష్య

చోదితములగు నిబంధనాదికములను గూడ నిరూపించి గ్రంథస్థము చేసెను.

మహత్తరమును ఉత్తేజకమును నగు నా రామదండు ప్రాశస్త్యము, భక్తిశూన్యులును కల్యారాధకులు నగు మన కాంగ్రెసు మహనీయుల కెంతమాత్రమును రుచింపకుండుట శోచనీయము. గోపాలకృష్ణుని జీవితకాలమందీ విషయమై యాతడెట్టి యిక్కట్టుల బడవలసివచ్చెనో యీ గ్రంథమున సూచింపబడినది. ఆతని నిర్యాణానంతరమున గూడ మన పెద్దలీ రామదండును విడిచి వానరసేనల బ్రోత్సహింప బూనిరి. గోపాలకృష్ణుడు వందలకొలదిగ శ్రీరామదండు గూర్చి యుపన్యాసముల నిచ్చి నెలల వరుసను చీరాల క్షేత్రమున తన యుద్యమమును నడపించినను నాతని హెచ్చరికలు వ్రాతలు దక్క రామదండువర్ణన యే పత్రికయందును గానరాదు. బార్డోలీసత్యాగ్రహములు, దండి నడకలు, నాగపూరు నాటకాలు, మనవారికి రుచికరములు. గోపాలకృష్ణుని మహిమ లా పరమేశ్వరునకే యెఱుక. ఇకనుండియైన కాలము మారునని యాశించుచున్నాము.

మాకు పుస్తకరూపముగను పత్రికాముఖముననను లభ్యమైన శ్రీ రామదండునకు సంబంధించిన వ్రాతలన్నియు నీ గ్రంథమునందు బొందుపరచుచున్నాము. ఇచ్చట వివిధ సందర్భములందు దెలుపఁబడిన విషయములు క్రోడీకరింపబడినందున కొన్నిచోట్ల పునరుక్తి యుండకమానదు. అయినను

నది యొక దోషమని యెంచక చదువరులు సందర్భానుసార ముగ సమన్వయము చేసికొనెదరుగాక.

శ్రీ రామదండు సమావేశములందు సప్తాహము లావశ్యకమని శ్రీ గోపాలకృష్ణుడు నిరూపించెను. ఈ విష యమైన గాథ యొకటిగలదు. అందుగూర్చిన యుత్తర ప్రత్యుత్తరములవలన గోపాలకృష్ణుని యభిప్రాయములను మనము గ్రహింపగలము. ఇందువలననైనను మన ప్రజలు ఆస్తిక్యము, అన్నదానము అను గోపాలకృష్ణుని ప్రధాన సూత్రములను గ్రహించి తల్లక్ష్యానుసారముగ నాచరించి యిహపరములకు పాత్రులయ్యెదరుగాక!

ఈ గ్రంథములోని కాగితములను కొన్నిటిని తమ పత్రికనుండి స్వీకరించుట కనుమతించిన 'ఆంధ్రపత్రికాధి పులు' శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికిని, అందలి యంశములను మాకు కూర్చియిచ్చిన రామకింకరుడు చిరంజీవి రామచంద్రుని వెంకటప్పకును, గ్రంథమును అచ్చు నకు వీలగునటుల సరిచూచుటలో మాకు తోడ్పడిన మా మిత్రులు శ్రీయుత గొల్లపూడి వెంకటేశ్వర్లుగారికిని, బ్లాకులు చెక్కించి చక్కగా నచ్చొత్తించిన ఆంధ్ర గ్రంథాలయ ముద్రణాధికారులకును, మేము కృతజ్ఞులము.

గోష్ఠి, విజయవాడ,
భావసం॥ర అధిక వైశాఖ శు ౧౫.

ఇట్లు విన్నవించు,
గుమ్మిడిదల సుబ్బారావు,
విచారణకర్త.

శ్రీరస్తు

# శ్రీ రామ దండు.

ప్రధాన కార్యాలయము - రామనగరు - చీరాల.

ఆంధ్రమహాజనులారా - పరాక్.

మనయొక్క ప్రస్తుతస్థితి చాల ఘోరముగ నున్నది. అనగా,

(౧) ధర్మసందేహము లెక్కువగుట

(౨) దారిద్ర్య మతిశయించుట

(౩) ధైర్య స్థైర్యములు తక్కువగుట

(౪) దారి దోవ కనబడక పోవుట

(౫) అనేకనాయకులును, అనేకమార్గములు,

అనేక ఊహాలు, మనలను బాధించుచుండుట.

ఇట్టివి లెక్కకుమీరినన్ని చెప్పవచ్చును. ఈచిక్కుల నుండి తప్పించుకొను మార్గమేమి? అది శ్రీరామభజన యొక్కటియే! అదియే తారకము.

మ॥ వరగోవింద కథాసుధారస మహా◆వర్షోక్తి ధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరో◆పాయానురక్తిన్ప్రవి
స్తరదుర్గాంత దురంత దుస్సహ మన◆స్సంభావితానేక దు
స్తరగంభీరకఠోరకల్మష కన◆ద్దావానలం బారునే?

అని పోతన మనీషి సెలవిచ్చినాడు. కనుక మన మన స్సులలో నిండియున్న సంశయాంధకారము బోగొట్టుటకు ముఖ్యమైనమార్గము రామనామస్మరణమే.

ఉ॥ 'రా' కలుషంబులెల్ల బయలంబడద్రోచిన 'మా' కవాటమై
డీకొని పోచు నిక్కమని శ్రీయుతులెన్న దదీయవర్ణనల్
గైకొని భక్తిచే నుడువ గానరుగాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ!

యని పరమభక్తాగ్రేసరుడగు గోపన్నగారు సెలవిచ్చి నారు.

పూర్వము వానరులుసైతము, రామభక్తులై జన్మ తరింపు సంపాదించినారు. నరులమని యనుకొను మనము మాత్రము అట్లేల చేయకూడదు?

మన ఆంధ్రదేశములో రామదండను ప్రతిష్ఠాపనము గతానుగతికముగ వెలయుచుండినది. దానిని పునరుద్ధార ణము చేయుట మన కర్తవ్యము. అట్లు చేసినచో,

౧. సంశయములన్నియు తీరును.

౨. సరియైన మార్గము గోచరమగును.

౩. దారిద్ర్యము నశించును.

౪. మనస్సు శాంతించును.

౫. సకలైశ్వర్య సంపత్తియు గలుగును.

కావున వెంటనే గ్రామములను, పల్లెలను పట్టణములను రామదండు ననుకూర్చి, సంశయాంబుధి దాటి జీవన్ముక్తు లగుదుము గాక.

శ్రీ రమారమణగోవిందో హరి॥

(దండు నిబంధనల సంక్షిప్తము, పూర్తి నిబంధనలు వేరొక పుస్తకమున జూడవచ్చును.)

(సం) దుగ్గిరాల గోపాలకృష్ణయ్య,
(౧౯-౨౦ - నవం - ౧౦.)



శ్రీరస్తు

# శ్రీ రామదండు.

## హెచ్చరిక

శ్లో॥ రామేతి వర్ణ ద్వయ మాదరేణ
సదా స్మరన్ ముక్తి ముపైతి జంతుః
కలౌయుగే కల్మష మానుషాణాం
అన్యత్రధర్మే ఖలునాధికారః॥

ఆంధ్రదేశమందు గతానుగతికముగ 'రామదండు' అను ప్రతిష్ఠాపనము నెలకొల్పబడుచు వచ్చినది. రామశబ్దము శైవ వైష్ణవాది సమస్తమైన యాంధ్రహైందవ సంప్రదాయముల కత్యంతాదరణీయమగుట 'రామదండ'ను పేరును నిరాక్షేపణీయముగ జేసెను. క్షామసమయములు, అరాజక సమయములు రామదండుయొక్క యుత్పత్తికి కారణములయ్యెను.

ప్రస్తుత స్థితిగతులలో ధర్మసందేహము లెక్కువగుటయు, దారిద్ర్య మధికమగుటయు, బహునాయకత్వ మేర్పడుటయు, ప్రజలయందశాంతి యతిశయించుటయు, ముఖ్యముగా గమనింపదగినవి. వీనిని జయించుటకు నిదానము, వివేకము, నిరోధము, ధైర్యము, శౌర్యము, స్థైర్యము, శీలము

అత్యవసరములు. అవి సంపాదించుట కాధునికులు స్వార్థజ్ఞానమే (Knowledge of self-interest) ప్రబల సాధనమని చెప్పుచున్నారు. ఆర్యసంప్రదాయ మిందుకు భిన్నముగ, నిరంతర మీశ్వరసేవాపరాయణత్వమే సాధనమని సిద్ధాంతీకరించి యున్నది. స్వార్థజ్ఞాన ముపదేశించి ప్రజల నావేశపూరితుల గావించినచో, అందు బయల్వెడలిన అహంకార విజృంభణము వలన కొంత కార్యసాధన సమకూరునుగాని, అవసరమగుపట్ల జనసమూహమును శాంతుల ప్రసన్నుల జేయుట మిక్కిలికష్టమును కొన్నికొన్ని సందర్భముల బొత్తుగా వీలుపడకుండుటయుగూడ అనుభవైకవేద్యము. రామశబ్దప్రవేశ మైనచో, దృష్టియందు నిలిచియున్న స్వార్థపరత, ధర్మనిరూపణ మవలంబించును. నాయకులప్పుడు విశ్వమూర్తియగు మహాజనసమూహమునకు నిగ్రహానుగ్రహములు రెండు ప్రసాదింపగలుగుదురు. తాము రామశబ్దసహాయముచే ప్రయోగోపసంహారములయందు సమర్థతగలవార లగుదురు. అందు ముఖ్యముగా ప్రజలు సమిష్టిగా తమలోక వ్యవహారములను జరుపవలసివచ్చిన యీ రోజులలో రామశబ్ద రహితమైన సమిష్టివ్యవహారము నిష్ప్రయోజనము, అనర్థజనకము, అపాయకరమును అగును.

కావున ప్రజల సంకల్పసీమల రామభక్తి ప్రవేశపెట్టినచో, వివేకము గలవారై, చిత్తనిరోధము గలవారై, నిశ్చలులై, శాంతులై, కార్యసాధనకు గడంగుదు రను విశ్వాసముతో యీ రామదం డేర్పాటు గావింపబడినది.

ఇంచుమించు యిట్టి యుద్దేశ్యములోనే, బాలభట సంఘమను నొక పాశ్చాత్యప్రతిష్ఠాపన మిప్పుడు కొందరు పెద్దలచే నామోదింపబడి మన యనుష్ఠానమునకు విధింపబడి నది. దానిలక్షణము లాంధ్రమహాజనుల కందరికి విదితములే. ఈ రెండింటికిగల భేదాభేదములు, యోగ్యతాయోగ్యత లును విచారించినచో మనతత్వమునకు యుక్తమైనది రామ దండనియే తెలగలదు. ఈవిచారణ పాఠకులకే వదలిపెట్ట బడుచున్నది.

'స్కౌటు' అనుపదమునకు అన్వేషించువాడు అని యర్థము. శ్రీరామచంద్రునియొక్క భాగ్యలక్ష్మి, రాజ్యలక్ష్మి, యర్ధాంగలక్ష్మియగు సీతామహాదేవిని యన్వేషించినవారే రామదండు, కావున పాశ్చాత్యరూపమగు స్కౌటుకు రామ దండనుపదమే యోగ్యమైన ప్రాచ్యానురూపము, జాతీయ మును, అగుచున్నది. ధర్మాన్వేషణము గావించి ధర్మసంస్థా పనమునకు తోడ్పడవలసినది రామదండనియే సిద్ధాంత మగును.

రామదండు కామధేనువు. ప్రజలవ్యవహారము లన్నిటి యందు నిఖిలపురుషార్థసాధనమందు రామదండు ప్రయోజన కారిగనుండును. ధర్మవిషయములు, ఆర్థికవిషయములు, రాజ కీయములు, మతసంబంధములు వగైరా అన్నిటియందు రామ దండుకు జోక్యము గలుగజేసికొనుటకు అధికారముకలదు. మహాజనముమీాద జరుగవలసిన కార్యములకు ప్రయోగ మందేగాక యుపసంహారమందుగూడ శక్తిసామర్థ్యములుండుట

ముఖ్యముగా యవసరము. కనుక రామమంత్రిబలిమిచేగాక యింకొక విధముగా వీలులేదు గావున రామదండు మార్గమే అవసరమని గ్రహింపనగును.

ఆంధ్రమహాజనులు రామదండు విషయము తగు శ్రద్ధ వహించి యుద్ధరింపబూనవలయునని నాప్రార్థన. ఈనిబంధనాదికమందు యేమైన యాక్షేపణలు, సవరణలు తోచిన యెడల సూచించి దీనిని సరియైన మార్గములో బెట్టుటకు ప్రయత్నించవలయునని మహాజనుల నందరిని ప్రార్థించుచున్నాను.

ధ్వజముమీద చిత్రింపవలసిన ప్రతిమయొక్క బ్లాకు తయారుగానందున యిందు గనుపర్చలేదు. పిమ్మట ప్రకటింపబడును. ప్రస్తుతము జండాకు శ్రీఆంజనేయస్వామి విగ్రహము గాని రామదండు భావమునకు విరుద్ధముగా నుండని యింకే విధమైన ప్రతిమనుగాని చిత్రింపవచ్చును.

స్వస్తి శ్రీరామార్పణ మస్తు.

| రామనగరు, చీరాల, | ఇట్లు విన్నవించు విధేయుడు, |
|---|---|
| మార్గశిర శు 2 శుక్రవారం | దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. |

శ్రీ



# శ్రీరామదండు.

'ప్రధానకార్యాలయము — రామనగరు — చీరాల.

## నిబంధనాదికము.

౧ <u>పేరు:</u>— ♦ శ్రీరామదండు.

౨ <u>ప్రధానకార్యాలయము:</u>—రామనగరు, చీరాల.

3 <u>ఉద్దేశములు:</u>—[అ] నిరంతరము భగవన్నామ స్మరణచేయుట. [ఆ] రామకార్యము లని అంగీకరింపబడు సమస్తమైన సత్కార్యములకు యిందు సభ్యులు తమ సర్వస్వమును సమర్పింప సంసిద్ధులై యుండుట.

౪ <u>అర్హత:</u>—శివకేశవారాధనయందు ఆదరణ గల యావన్మంది ఆంధ్రులు యిందు సభ్యులుగనుండ నర్హులు.

---

♦ గుంటూరులో జరిగిన సభయందు "హిందూ ఇస్లాము బందోబస్తు నిమిత్తము" స్వచ్ఛంద సేవకుల నేర్పాటుచేయవలయునను తీర్మానము గావింపబడు సందర్భమున రామదండువిషయము ప్రస్తావింపబడి, రామదండు హిందువుల నిమిత్తమున్ను, మహమ్మదయులకొరకు మహాఫుజుల్ ఇస్లాము అను పేరుతో నొక సంఘమును ఏర్పరచి యీరెంటిని సమిష్టిగా వ్యవహరించవలయునని తీర్మానించడమైనది.

౫ దీక్షావిధానములు:—[అ] రూపము:—చెంగావి ధోవతి, చెంగావిరంగు చొక్కా, చెంగావి తలపాగ, కుంకుమ తిలకము, శంఖము, తులసిపూసపేరు, లేక, రుద్రాక్షలహారము, అంగవస్త్రము, తామ్రిపాత్రి దండము, తాళపు చిరుతలు, నవీన జీవకళాసూచకంబగు నొక పచ్చని రెమ్మయు, వీటిని ప్రతి సభ్యుడు దీక్షాసమయములందు ధరించి యుండవల యును. ప్రయాణములందు ఒక సంచికూడ నుండవలయును. ఇందు వంటచేసికొనుటకు దస్తాయున్ను, నిప్పుపెట్టె, తాలింపు సామానులు వగయిరా లుండవలయును. [ఆ] సమయములు:— పండుగదినములును రామదండుయొక్క శాసనసభచే విధింవ బడు తదితరదినములందును దీక్ష వహింపవలయును.

[ఇ] వాక్యములు:—"రమారమణ గోవిందోహరి" యనియు "హరహర మహదేవ" యనియు "రామ రామ" యనియు (దశ్శరథాదిఖడ్గముల) "రామార్పణమ్" అనియు రోభచితముగ నుచ్చరించు చుండవలయును.

[ఈ] పాటలు, నృత్యములు, భజన, దండు జండా చుట్టు నిలువఁబడి అధ్యాత్మరామాయణము, ధర్మపురి రామాయణము వగైరా కీర్తనలున్ను, తరంగములు, అష్ట పదులు మొదలగు భగవత్ప్రితికరములగు సమస్తమైన కీర్తన లు గాననృత్యాదులతో భజనలు సలుపుచుండవలెను.

[ఉ] దీక్షాసమయమునందు వర్తింపదగు ధర్మము:—

[౧] నాయకుని గురువుగా నెంచి గురుశుశ్రూష ధర్మము ననుసరించుట.

[౨] అనుదినము ప్రాతఃకాలమున స్నానసంధ్యా నుష్ఠానముల దీర్చికొని దీక్షావస్త్రధారణము నాచరించి రామనామస్మరణ జేయుచు గురునిర్దిష్టమైన కార్యమును నిష్కళంకముగ నిర్వివాదముగ నిశ్చల మనస్కుడై యాచరించుట.

[3] దీక్షాసమయమున సర్వసంగ వర్జితుడుగా నుండి చిత్తము శ్రీరామపాదములందు జేర్చి నిశ్చలమైన బుద్ధితో నెట్టి కార్యము నైనను యెట్టి త్యాగము అవసరమైనను నిర్వర్తించుటకు సంసిద్ధుడగుట.

[౪] దీక్షాసమయముల జాతిమత వివక్షతలేక సమస్తమైన ప్రాణులను నిజస్వరూప ప్రతిబింబములుగా నెఱింగి సంపూర్ణ ప్రేమాంతరంగుడై సమబుద్ధితో ప్రతి సభ్యుడును వర్తించవలయును. భోజనపానాదులయందు వనభోజనములందలి ధర్మము ననుసరింప వలయును.

[౫] మహాజన సమావేశములు నదీపర్వత సముద్రాది ప్రాంతములును, దేవాలయాది ప్రదేశములును పుణ్యక్షేత్రములుగా దలంచి యవి ఈశ్వరుని ప్రత్యక్షస్వరూపముగా నెఱింగి యా యా స్థానముల భజన సేవ యిత్యాది భక్తి మార్గము లనుష్ఠించు చుండవలయును.

[౬] ధ్వజము:—అతి పవిత్రమును తేజోవంతమును మహాశక్తియుతమును అగు వజ్రముయొక్క [ఇంద్రధనుస్సుయొక్క] సాంప్రదాయసిద్ధమైన రూపమును ధ్వజదుకూల

ముపై జిత్రింప వలయును. ఇందుపై నిరంతర రామసేవాపర తంత్రుడును నిష్కామసేవ దీక్షాస్వరూపియు నగు శ్రీఆంజ నేయుని చిత్రింపవలయును.

[2] కార్యనిర్వాహకులు:—ప్రతిగ్రామము నందును రామదండేర్పడిన పిమ్మట దాని దాని యధికారులు తెలియ పరచిన వెంటనే నిబంధనలు దెలుపు పుస్తకములు వగైరా లన్నియు పంపబడును. ప్రతిగ్రామమందును, రామమందిర మొకటి యేర్పడవలయును. ప్రతిగ్రామదండుకున్న నలు గురు కార్యనిర్వాహకు లుండవలెను.

౧ దండుశర్మ:—ఈయన దండుకు పురోహితుడుగా నుండును. సాత్విక స్వభావముగలిగి శాంతమూర్తియై విద్వాంసుడై, దండునకు నిరంతరము వివేకజ్ఞానమును బోధించు చుండవలయును. ఇతిహాసపురాణములు ధర్మము అనవరతము దండునకు బోధించుచుండవలెను. ఈయన దీక్షాసమయము లందు దండుధర్మమును చక్కగా వ్యాఖ్యానముచేసి బోధించి సభ్యులచే అనుష్ఠింపజేసి దండుయొక్క ధర్మాభ్యుదయమునకు తోడ్పడవలయును. ఈయనను 'దండుసభ్యులందరు ఏకగ్రీవ ముగా నెన్నుకొనవలయును. దండునాయకుడగు "వర్మకు" ప్రధానమంత్రిగా నుండవలయును. దండుప్రకటనములయందు వీరుభయుల దస్కతు లుండవలయు.

౨ దండువర్మ:—ఈయన గ్రామదండుకు ప్రధాన నాయకుడు. ఈయన సభ్యులందరిచే నేకగ్రీవముగా నెన్నుకొన

బడవలయును. సాధ్యమైనంతవరకు వోట్లువేయక చేతులెత్తక సభ్యులందరు కలయబలుకుకొని రమారమిగా నెల్లరచే సంగీకృతుండైనవానిని నియమించుట యుత్తమమార్గము. దండు కార్యములందు నిరంకుశాధికారము గలిగియుండ వలయును. గ్రామదండుయొక్క వ్యవహారము లన్నిటిని వివేకముతో దయాదాక్షిణ్యాదులతో ధైర్యస్థైర్య శౌర్యశీలములు గలిగి కడు జాగరూకతతో పరిపాలించుచుండ వలయును. దండుసభ్యులందరియొక్క ప్రేమకు పాత్రుడై యుండవలయును. దండు పంచాయితీకి అధ్యక్షుడుగా నుండవలయును. తనకు వ్యతిరేకాభిప్రాయులై యుండు సభ్యులను అత్యంతసాత్విక మార్గముచే తన కనుకూలురనుగ జేసికొనవలయును. దండుధర్మమునకు నేమాత్రము వ్యతిరేకముగా నడువగూడదు. నిష్పక్షపాతబుద్ధితో దండుసభ్యుల నెల్లరను సోదరులుగా భావించి దండునందు తగాయిదాలు ఏమాత్రము లేకుండ ప్రేమను పెంపొందింపుచుండవలయును. తనకు ఎవ్విధముచేతను స్వాధీనముకాని సభ్యుని శిక్షించుటకు వర్మకధికారము గలదు. అట్టిశిక్ష పంచాయితీ తీర్పునకు లోబడి యుండవలయును. ప్రథమతప్పిదమునకు నూరింటికి మించకుండ సూర్యనమస్కారములును, ద్వితీయతప్పిదమునకు ఒకరోజు ఉపవాసమును, తృతీయమునకు దండుసభ్యత్వమునుండి యొక నెలరోజులు విడుదల చేయుటయు, చతుర్థమునకుసంపూర్ణముగా దండునుండి వెడలనడుపుటకును అధికారముగలదు. తాలూకా సభనుం

డియు జిల్లాసభనుండియు జారీఅయిన యుత్తరువులను వర్మ నిర్వివాదముగ నమలుజరుప వలయును. దండుసభ్యులు యితరగ్రామములనుండి తనసహాయము కోరవచ్చినచో తన శక్త్యనుసారముగా అన్నివిధముల సహాయ కారిగ నుండవల యును. దండునకు నియమితములగు కార్యముల నన్నిటిని శ్రద్ధా భక్తులతో జరిపించు చుండవలయును. తనదండుసభ్యుల యొక్క దీక్షానామముల పట్టీని తయారుచేసి యుంచుకొన వలయును.

3 దండుగుప్త:—దండుదక్షిణాల వసూలుజేసి జమా ఖర్చులెక్క యుంచి దండుపంచాయితీకి ద్రవ్యవిషయమున జబాబుదారిగా నుండవలయును. దండుయొక్క రామమందిర మును ఇంకను నితర స్థిర చరాస్తులయొక్క వివరములు లెక్కలు చక్కగానుంచి వాటివిషయము తగుశ్రద్ధవహించి దండు యొక్క ఆదాయవ్యయమునుగూర్చి తగుజాగ్రతగా చర్య జరిపించుచుండ వలయును. వర్మయొక్క చీట్లను ఆధారముజేసి కొని దండువ్యవహారములఖర్చు జరుపుచుండవలయును.

4 దండుదాసు :—ఈదాసుపదవి శర్మవర్మగుప్తలు గాక మిగిలిన యావన్మంది దండుసభ్యులు, వంతులప్రకారము అనుదినము గ్రహించుచుండవలయును. దాసు, రామమందిర మునకును వర్మకును దండుపంచాయితీకిని ఉపచారము సేయు చుండవలయును. ఉపచారములును సేనయును దండువ్యవహా రానుకూలమగు కర్మలయందు మాత్రమే వర్తించును. దండు జెండా దాసుస్వాధీనమై యుండవలయును. నిత్య వ్యవహారము ల

అమలు జరిపించుటయు, పంచాయతీయొక్కయు, వర్మశర్మ గుప్తలయొక్క ఆజ్ఞలను అమలు జరుపుట దాసుయొక్క ముఖ్య ధర్మము. ఈయాజ్ఞలను నిర్వివాదముగ నిర్వర్తించుచుండవల యును.

కార్యనిర్వాహకులయందు శర్మవర్మగుప్తలు సంవత్స రాంతమునను దాసు, వరుసవెంబడి అనుదినమును, ఎన్నబడ వలయును. శర్మవర్మగుప్తలు సభ్యుల యావన్మందిచే యెన్న బడి ఆ సంవత్సరమునకు అధికారము వహించియుందురు. దాసు పంచాయితీ తరఫున వర్మచే అనుదినము నియమింపబడును. అవసరమైనచో దాసు అనేక దినముల వఱకు నొకరినే నియ మింపవచ్చును. ఈ శర్మవర్మగుప్తదాసునామములు ప్రస్తు తము మనదేశమునందు వర్తించుచున్న వర్ణవిభాగము లందలి దుష్టమగు భేదప్రవృత్తిని పెంపొందించుట కేర్పడినవిగా నే మాత్రము భావింపగూడదు. వర్ణభేద మన కేవలము వృత్తి భేదమే యను సనాతనధర్మ సిద్ధాంతము నాచరణయందు బెట్టి ప్రస్తుతమిందేర్పడిన దురాచారము తొలగింప నుద్యమించుట గూడ యేతన్నామ నిరూపణముయొక్క ముఖ్యాభిప్రాయమై యున్నది. దండునందు సమస్తమైనవారు సభ్యులుగానుండ వర్హులని వెనుక సూచింపబడియున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులందరియందు ఎవరైనను సమర్థతగలవారు శర్మవర్మగుప్తదాసు పదవుల ధర్మముల ననువర్తింపగలిగినచో ఆయాపదవుల కెన్నుకొనుట కర్హులేయని దీనియొక్క ముఖ్యా భిప్రాయము. ఈ నామములిందు బొందుపరచుటకు కార

ణము లెవ్వియన [౧] "కార్యదర్శి" "సంఘాధ్యక్షుడు" "కోశాధ్యక్షుడు" అనుపదములు పాశ్చాత్యాభిప్రాయానుసరణములును స్వసంప్రదాయభిన్నములును నగుటచే వానిని వర్జించుటయు స్వయంవ్యక్తిత్వము నుద్ధరింపనగు భావములను తత్ప్రకాశరూపమగు భాషయు గ్రహించుటయును జాతీయత యొక్క ముఖ్యాదర్శమగుట మొదటిది; [౨] సంప్రదాయమందు వ్యవహరింపబడు పదములకు యథార్థమైన భావములను సిద్ధాంతీకరించి ఆచరణలోబెట్టి యజ్ఞానమువలన ప్రవేశించిన దురాచారమును తొలగించవలసిన యావశ్యకత రెండవది. కావున యీపదములు వాడుటయే సమంజసము.

[౮] పంచాయితీ:—దండుయొక్క శర్మవర్మ గుప్తదాసులు నలుగురును మిగిలిన సభ్యులలో రామునిచే నెన్నబడినవారును [లాటరీ ప్రకారము యెన్నుట] యీ యైదుగురు కలిసి, దండు పంచాయితీగా నేర్పడెదరు. నెలకొకసారి యైనను పంచాయితీసభ జరుపబడవలయును. సభకు వర్మ అధ్యక్షుడుగానుండును. చర్చనీయాంశముల ప్రవేశపెట్టుటయు చర్చను ప్రారంభించుటయు సారాంశములను, తీర్పులను లిఖితరూపముగానుంచుటయు పంచాయితీసభాసమావేశములను సకాలమున ప్రకటించుటయు మొదలగు కార్యదర్శియొక్క విధులు శర్మ ఆచరింపవలయును. అవసరమైనప్పుడెల్ల పంచాయితీసభ సమావేశమును జరుపవచ్చును. దండువ్యవహారములన్నియు చర్చించి తీర్పుచెప్పుటకు పంచాయితీ సభ కధికారము. వాని నమలుజరుపు జవాబుదారీ వహించవలయును. అత్యంతావసర

సమయములందు వర్మస్వాభిప్రాయ ప్రకారము వ్యవహారము జరుపవచ్చును. అందు లోపములున్నయెడల మందలించుటకు ఆపని జరిగినపిమ్మట పంచాయతీసభ కధికారము గలదుగాని తాత్కాలికముగా వర్మ యొక్క ఆజ్ఞయే జరిగి తీరవలయును.

[F] తాలూకాసభ:— ప్రతి గ్రామమునందు దండు తీర్మానైనపిమ్మట ౫౦ గ్రామదండులకు తక్కువ లేకుండా యేర్పడినచో వీరందరు గలిసి యొక తాలూకాసభ నేర్పాటు జేసికొనవచ్చును. ఆ తాలూకా నిరూపణము ప్రస్తుతము రాజ్య పరిస్థితుల ననుసరించి యేర్పడిన తాలూకానామమునుగాని, లేక వారిచ్ఛవచ్చిన పట్టణము ప్రధానముగా నేర్పరుచుకొని దాని నామముగాని, యేర్పరుచుకొని ఆయాపట్టణ నామముతో తాలూకాసభగా నేర్పడవచ్చును. ఈ తాలూకాసభయందు ప్రతిగ్రామ రామదండుయొక్క శర్మవర్మలు సభ్యులుగా నుందురు. వీరందరు గలిసి అధ్యక్షుని నెన్నుకొనవలయును. ఆ యధ్యక్షునికి "రావు" అనుబిరుదు వర్తించును. ఏకగ్రీవముగా సాధ్యమైనంతవరకు యీ "రావు" నెన్నుకొనవలయును. ఏకగ్రీవముగా నెన్నని పక్షమున అధిక సంఖ్యాకులచే నెన్న బడినవారే యీపదవి నధిష్ఠింతురు. ఏకగ్రీవముగా నెన్నబడిన "రావు" యొక్క ఆజ్ఞ లనుల్లంఘనీయములు. రెండవవిధమైన "రావు" కేవలము సభాధ్యక్షతగలిగి సభా తీర్మానములు మాత్రమే యమలుజరుపుటయు సభా తీర్మానాభావమునందు స్వతంత్రించి వ్యవహరించుట కధికారము లేకుండుటయు ముఖ్యముగా గుర్తింపనగును. తాలూకాసభ "రావు" నెన్ను

కొనుటయేగాక తమలోనుండి యింక నలుగురుని రామునిచే నెన్నుకొనునట్లుచేసి, అనగా [లాటరీప్రకారము] యీ నలుగురును ఆ "రావు"తో సహా ఐదుగురు తాలూకా రామదండు వ్యవహారసభగా నేర్పాటు చేయవలయును. తాలూకాసభ సంవత్సరమునకు రెండు పర్యాయములు సమావేశము కావలయును. తాలూకా వ్యవహారసభ నెలకొకపర్యాయమైనను సమావేశము కావలయును. ఎన్నికలు ప్రతిసంవత్సరాంతమున జరుపబడి యేర్పడు సభ్యులు, అధికారులు ఆ సంవత్సర వ్యవహారము జరుపుటయందు బాధ్యత వహింపవలెను.

రావుయొక్క విధులు :—రావు తాలూకా రామదండుకు ప్రధాననాయకుడై నిశ్చలమైన రామభక్తితో దండుకార్యముల ననుష్ఠింపవలయును. ప్రతిగ్రామమునకు దండుధర్మములను సూచించుచు సంశయ నివారణముచేయుచు గ్రామ పంచాయితీలనుండి తెలియపఱుపబడిన విషయముల నన్నిటిని దర్శించి తీర్పుజెప్పుచు తగుసహాయము జేయుచు నుండవలయును. ప్రతివిషయము తాలూకా పంచాయితీ అనుమతి ప్రకారము జరుపవలెను. అత్యంతావసరమగు సమయముల నేకగ్రీవముగా నెన్నుకొనబడిన 'రావు' మాత్రమే స్వతంత్రాధికారము వహించి పనిజేసి అనంతరము పంచాయితీ అనుజ్ఞకు సమర్పించి వారి నిందామండలింపులకు బద్ధుడై యుండవలెను. ఇతరవిధమైన 'రావు' తనపంచాయితీ తీర్పులేనిది యేమాత్రము వర్తింపగూడదు.

తాలూకా వ్యవహారసభ:—ఇందు రావు అధ్యక్షుడు. మిగిలిన నలుగురిలో రామునిచే నెన్నబడిన యొకరిని కార్యదర్శిగా నేర్పఱుపవలయును. ఇతరవిధులు మామూలు పంచాయితీసభవలెనే జరుపవలయును. ద్రవ్యము కార్యదర్శి యొద్దనేయుంచి జమా ఖర్చులెక్క నుంచవలెను. తమకు తాలూకా సభయందు ఐదుగురు చారులను యిద్దరు దాసులను యేర్పాటుచేయుంచవలయును. ఈదాసును ఆపట్టణపు దండునుండి యేర్పరచుకొనుట మంచిది. చారులు ఇతరగ్రామములవారుగూడ నుండుట మంచిది. చారులు గ్రామాదుల నుండి వార్త తెలియపరచుటయు వార్తలను ఉత్తరువులను జారీచేయుటయు ముఖ్యమయిన విధులుగా గ్రహింపవలెను. దండువ్యవహారముల నన్నిటిని అవసరమయినంతవరకు లిఖితరూపముగా పుస్తకములయందు బొందుపఱచి యుంచుకొనవలయును. ఈరికార్డులు జాగ్రతగా పోషించుచుండవలయును.

౧౦. (జిల్లా) మండలసభ:— రావులందరు కలసి ఒక మండలసభ యేర్పడవలయును. ఏకగ్రీవముగా నెన్నుకొనబడిన అధ్యక్షుడు సభాతీర్మానాభావమందు స్వతంత్రాధికారము గలిగియుండును. ఇతరులు సభాతీర్మానమునకు బద్ధులు. మండలసభాధ్యక్షునకు "పంతులు" అనుబిరుదు గలిగియుండును. లేక 'పెద్ద' యనియుగూడ వ్యవహరింపవచ్చును. ఈసభ నెలకొక పర్యాయము సమావేశము కావలయును. దండుధర్మమంతయు సిద్ధాంతము చేయుటయు దండు ఉత్తరువుల నడిపించుటయు ప్రధానమైన విధులుగా గ్రహింప

వలయును. ఈ దండుపంతులకు వలయు ద్రివ్యమును దాసులు చారులు వగైరా వీలగు రీతి నేర్పరుపవలయును.

౧౧. యావదాంధ్రి మండలమునకు ప్రిధాననాయకు డీ పెద్దలందఱిచే నెన్నుకొనబడవలయును. ఆయన 'రామదాసు' అనియు 'హనుమాన్' అనియు 'జగన్నాథుడు' అనియు నాయకుడు అనియు బిరుదులు గలిగియుండవలెను. ఈ పెద్దల సభ రామదండు ప్రిధానసభకు, రామదండు ధర్మసభయని నామము. ఈపెద్దలనుండి మంత్రిని ఎన్నుకొనవలయును. ఈసభ తమయిచ్చవచ్చిన స్థానము ప్రధానకార్యాలయముగా నేర్పాటుచేసికొనవచ్చును. ఇది యేర్పడువరకు ప్రిస్తుతము ఆంధ్రివిద్యాపీఠగోష్ఠికి కార్యస్థానమగు చీరాల రామనగరు ప్రధానకార్యాలయముగా నేర్పడియున్నది. ఇదియే మును ముందు ప్రధానస్థానముగా నిష్టమున్నచో నంగీకరింప వచ్చును. అందుకై నిచ్చట రెండుయకరముల స్థలము నిర్దేశింపబడియున్నది. ఈ నాయకుడు పెద్దలసభతో సహా రామదండుధర్మము పరిపాలించుచుండును. దుష్టశిక్షణము శిష్టరక్షణము ధర్మసంస్థాపనము ప్రితినాయకునియొక్క విధియని శ్రుతిస్మృతి పురాణేతిహాస సదాచార సంప్రిదాయ పరంపరగా నంగీకరింపబడుటచే యావదాంధ్రిమండల రామదండునాయకులు అట్టి సన్మార్గ మవలంబించి దండుధర్మముల పరిపాలించి ఆంధ్రి లోకాభ్యుదయ పరంపరాభివృద్ధికి తోడ్పడి రామభక్తి ప్రజానురక్తి సంపూర్ణముగా శాంతమూర్తియై భక్తివిశ్వాసముల పెంపొందింపగలిగి రామదండు నుద్ధరింపవలెను. రామదండు

నిబంధనలు శ్రద్ధాభక్తులతో నమలు జరిపించుచుండవల యును. ఆంధ్రమండలంబున రామభక్తియు సర్వప్రాణిసమ త్వమును ప్రేమయు సాత్త్వికవృత్తియు పరోపకార పారీణ తయు సర్వభూతహితము వ్యాప్తి నొందించుటకు రామదండు నాయకులు నిరంతరము కృషిసల్పుచుండవలయును. నాయక శబ్ద మాతనికే వర్తింపవలయును.

---

## నిబంధనలు.

(అ) ప్రతిగ్రామమునందును ౧౮-౫౦ సంవత్సరముల మధ్యనున్నవారు (పురుషులు) రామదండు నేర్పఱచుకొను టకు ఒప్పుకొనవలయును.

౧౮ సంవత్సరములకు తక్కువ వయస్సుగల బాలు రందరుగూడ రామదండునం దుండ నర్హులేగాని వారు దండు వ్యవహారముల విచారించుటకును నాయకత్వమును వహించు టకును అర్హత గలిగియుండరు.

(ఆ) ప్రతిదండును ఒక రామమందిరమును తమగ్రా మమునందు గలిగియుండవలెను. అచ్చట ప్రతిదినము పురాణ కాలక్షేపమును జరుపవలయును. మందిరమున ఉపాస్యదేవత యొక్క పటములుగాని యితరచిహ్నములుగాని ప్రతిష్ఠింప బడి యుండవలయును. అచ్చట ధూపదీప నైవేద్యాదులకు వలయు ఖర్చు దండుదక్షిణలవలన జరుపబడవలయును. భగవ

తృప్తికరములును సత్కార్య ప్రేరణకు వినియోగించునట్టి గ్రంథములు పత్రికలు వగయిరాలుగూడ మందిరమున నుంచి పఠించుచుండవలయును.

(ఇ) ప్రతిసభ్యుడును తనకుదోచిన దక్షిణను ప్రతి నెలకును ప్రతిదీపావళి దినమునను దండు వ్యవహారనిమిత్తము సమర్పించుచుండవలయును.

(ఈ) మందిరమునందు జరుగనున్న దండు వ్యవహారములన్నియు ప్రకటనబల్ల నొకదాని నేర్పఱచి లిఖితరూపముగా నందు పొందుపఱపవలయును. వాటి ననుసరించి అనుదినము సాయంకాలము రామదండుగోష్ఠినిమిత్తము విచ్చేయు సభ్యులందరు తమతమ విధ్యుక్తకార్యముల నెఱింగి యితరులకు తెలిపి వర్తింపవలయును.

(ఉ) మందిరమునందు యీ క్రింద నుదాహరింపబడు నమూనాప్రకారము ప్రతిసభ్యుడును రామదండుధర్మమును గూర్చి తనకు దోచిన సూచనలను తెలుపుచుండవలయును.

న మూ నా.

| తిథి. | పేరు. | సూచన. | పంచాయితీతీర్పు. | షరా. |
|---|---|---|---|---|
| | | | | |

దీనివలన దండువ్యవహారముల గూర్చి ప్రతి సభ్యుడు తన యభిమతమును గూడ సర్వజనాంగీకారము గావింపజేసి జరిపించుకొనవచ్చును.

(ఊ) సర్వజనాంగీకృత మైనట్టియు సర్వభూతహిత మైనట్టియు కార్యములయందు స్వతఃగా గాని లేక నితరులచే నాహూతులై గాని సంపూర్ణముగ ప్రవేశించి కార్యసానుకూలముజేయ నుద్యమింప వలయును. ఇవిగాక రామదండు పంచాయితీసభచేగాని తాలూకావ్యవహారసభచేగాని మండలమహాసభచేగాని యావదాంధ్ర మండలముల యొక్క రామదండుధర్మసభచేగాని రామ కార్యములని తీర్మానింపబడు సమస్తమైన కార్యములను సంపూర్ణముగా నిర్వహింపవలయును. దండుయొక్క బహుసంఖ్యాకులచే నిరసించబడిన కార్య మాచరింపబడదు. పెద్దలయంగీకారము బడసిననే గాని యాచరింపగూడదు.

(ఋ) యావదాంధ్రమండల రామసైన్య మహాసమావేశము సప్తాహరూపముగ పెద్దలచే తీర్మానింపబడిన యొక పుణ్యక్షేత్రమున సంవత్సరమున కొకతూరి జరుపబడలయును.

(ౠ) ౧౮ సంవత్సరములకు తక్కువగల బాలురు వారియొక్క యుపాధ్యాయు లెవరైనను ఆ గ్రామముయొక్క రామదండునందు సభ్యులుగా నున్నయెడల వారి యాజ్ఞకు బద్ధులై యుండవలయును.

(ఌ) యువకులగు రామదండుసభ్యులు అనుదినము సూర్యోదయాత్పూర్వము నిద్రమేల్కాంచి నిత్యకృత్యముల దీర్చికొని సూర్యనమస్కారములు, హనుమాన్ బస్కీలు, యితరవ్యాయామ సంబంధమగు బస్కీలు, ప్రాణాయామము, సంధ్యావందనము నాచరించు చుండవలయును. సాయం

సమయముల వ్యాయామ సంబంధమగు విధానములన్నియు వారివారి సమర్థతలనుబట్టి యాచరింపవలయును. ఇవియన్నియు రామ శబ్దసహితముగను రామ కథారూపమగు కీర్తనల తోడను అనుసంధించి జరుపవలయును. రాత్రి భోజనానంతరము కోలాటము నృత్యము వగయిరా భజనరూపములు అనుష్ఠింపవలయును. వృద్ధులుగా నున్నవారు వారివారి విధ్యుక్త ధర్మముల నాచరించుచు రాత్రియందు రామగోష్ఠి మందిరమున జరుపవలయును. పురాణ కాలక్షేపము హరికథలు ధర్మసంబంధమగు నుపన్యాసములు వాక్యార్థములు వగైరాలు జరుపుచుండవలెను.

(ఆ) ప్రతిగ్రామమునందును నిరుపేదలను పోషించు మార్గము ననుష్ఠించుట రామదండుయొక్క ముఖ్యకర్తవ్యమై యున్నది. ఇందునిమిత్తము ప్రతిగ్రామ మందిరమునకు దీన జనశరణ్యమను నొక యాశ్రమమును గ్రామప్రాంతమున నెల కొల్పి యందు గ్రామమందు భిక్షాటనజేయు సమస్తమైన వారిని స్త్రీ పురుషులకును అన్నివర్ణముల వారికి ప్రవేశనాదికము నిర్మించి వారివారి సమర్థతలనుబట్టి యోగ్యతలనుబట్టి వృత్తుల గల్పించి అందుకువలయు ద్రవ్యాదికము గ్రామమందుండు మహాజనులయొద్ద బిచ్చమెత్తి సాధ్యమయినంతవరకు వీరలకు స్వయంసహాయ మలవడునట్లు జేసి యచ్చట తయారుగాబడు పదార్థంబుల నన్నింటిని గ్రామమందు విక్రయముగావించి తద్ద్వారా వారిని స్వయంకృషిచే జీవించునట్లుగ జేయవలయును. ఈ శరణాలయమునందు నొక దేవాలయము గూర్చి యీశ్వర

భక్తి పెంపొందింపవలయును. భిక్షాటనమొనర్చు బ్రాహ్మణులకిందు వసతినేర్పరచి శరణాలయవాసులకు హితోపదేశంబును వారిపిల్లలకు విద్యయు గఱపునటుల చేయవలయును. శరణాలయమునకు వలయు భూమి గ్రామస్థుల ననేకవిధముల ప్రార్థించి సంపాదింప వలయును. ప్రతిరామదండు సభ్యుడును తన గ్రామమునందు భిక్షాటనమొనర్చువా రుండగూడదను ప్రతిజ్ఞ స్వీకరించి దీనావన వ్రతము ననుష్ఠింప వలయును. రామదండుయొక్క ప్రధానమైన కర్తవ్య మిదియేయని దండు నేర్పాటు చేయువారు స్పష్టముగా నెఱుంగునది.

(౨) గ్రామమునందు రామదండేర్పడిన వెంటనే అచ్చటనుండి బయలుదేరి తమ చుట్టుప్రక్కలనున్న గ్రామాదులకు వెడలి రామనామ ప్రభావమును రామదండు యుద్దేశ్యములను ఆయాగ్రామవాస్తవ్యులకు బోధించి అచ్చట రామదండును స్థాపించి తిరిగి స్వగ్రామములకు చేరుచుండవలయును. అట్లు పోవునపుడు రామదండు మేళముతోను రామునియొక్క విగ్రహముతోను దండుజెండాతోను భజనలతోను నొక నియమబద్ధముగా లయాన్వితముగా నడుగులిడుచు రామశబ్దధ్వానంబులు దిక్కుల నిండించుచు అత్యంత ప్రేమాతిశయముచే తమ కెదురగు సమస్తమైన ప్రాణులను ఆదరించుచు సరసముగా ప్రయాణము సలుపవలయును. సాధ్యమైనంతవరకు తాము పోవుచున్న గ్రామవాసులకు నేమాత్రము నాయాసము గలుగకుండ భోజన పానాదులు స్వయముగా నేర్పరచుకొనవలెను. అట్లుగాక ఆయాగ్రామవాసులు భోజనపానాదులతో సంభా

వింప సమకట్టినచో వారి యౌదార్యము నంగీకరింపవచ్చును. ప్రయాణమునకు పూర్వ మొకరోజైనను ముందుగ తాము వెళ్ళబోవు గ్రామవాసులకు తమరాకఁ దెలుపవలయును.

(ఏ) తమగ్రామ సమీపమునుండిగాని దూరమునుండి గాని యెచ్చటనుండి యయినను నితర గ్రామములనుండి యయినను ఆర్తనాదము సహాయాపేక్ష వినవచ్చినచో తక్షణమే దీక్షవహించి రామదండు తమకు చేతనైనంత సేవ జేయవలయును.

(ఐ) రామదండు వ్యవహారములను చర్యలను ఆంధ్ర మహాజనులకు నిరంతరము తెలుపుటకును వివిధప్రదేశ వృత్తాంతములను ప్రచురించుటకును రామదండుధర్మమును సిద్ధాంత పూర్వ పక్షములు గావించుటకును పత్రిక యావశ్యకము గావున 'రామదండు' అనుపేర పత్రికను ప్రచురించుచుండవలయును.

స్వస్తి శ్రీరామార్పణమస్తు.



# ఆలమూరు సభ.

1924 మేనెల 3-వ తేదీ మధ్యాహ్నము రెండు గంటలకు ఆలమూరులో కురుగంటి సీతారామయ్యగారి యజుర్వేద పారాయణముతో గోదావరీమండల స్వచ్ఛందసేవకుల సభ ప్రారంభింపబడెను. అధ్యక్షుడు ఆంధ్రరత్నము తన సహజవేషమును దాల్చియుండెను. తలపాగా, మెడలో రుద్రాక్షమాలిక, కానిడబ్బంత కుంకుమబొట్టు చేతిలో విసనకఱ్ఱ, ప్రథమమున నొక పళ్ళెరములో కుంకుమనుంచి సభాసదులను తిలకధారుల నొనరించెను. అంత సభావేదికపై దేశభక్తుడు, కాళేశ్వరరావు, అయ్యంకి వేంకటరమణయ్య, వరదరాజులునాయుడు, సురేంద్రనాథఆర్యా, కావ్యకంఠుడు మొదలగు నెందఱో సుప్రసిద్ధ ప్రేక్షకు లాసీనులై యుండిరి.

ఆహ్వానసంఘాధ్యక్షుడు సబ్నివీసు వెంకటకృష్ణారావుగారు తమ స్వాగతోపన్యాసము జదివి అధ్యక్షుని బుష్పమాలాలంకృతుని జేసిరి. అధ్యక్షుడు లేచి కర్పూరహారతి నిచ్చి నారికేళమును నైవేద్యమొనర్చి యధ్యక్షకోపన్యాసమునం దుంచెను. ఆంధ్రరత్నము మున్ముందు 116 ర్లతో సత్కరించనిదే యుపన్యసింపరు. ఆ ప్రతిన సభాసదులకు విన్నవించెను. ముందుగా వరదరాజులునాయుడుగారు 20 రూపాయలను పళ్ళెరమునం దుంచిరి. సభాసదులు తోచినవఱకు కట్నముల నిచ్చిరి. అంత నధ్యక్షుడు శ్రీరామస్తవముతోను,

ఆంజనేయ కీర్తన శ్లోకములతోను అర్థశ్లోపన్యాసమును ప్రారంభించెను. తన కుపన్యాసమును వ్రాయ నలవాటు లేద నియు, నదియే క్రొత్తయనియు ననిరి. ఆంధ్రరత్నముయొక్క అర్థశ్లోపన్యాసమును ప్రతి ఆంధ్రుడును తప్పక పఠింపవల యును. నేటివఱకును మనము స్వచ్ఛంద సేవక గణమును నేర్పరచునపుడు కొంతవరకైనను పాశ్చాత్యపద్ధతుల ననుస రించుచుండుట నిస్సంశయము. మతవిషయ ప్రాముఖ్యత నీయక కేవలము రాజకీయ విషయములకొఱకే స్వచ్ఛంద సేవకగణము నేర్పాటు చేయుచున్నాము. కాని నేడు ఆంధ్ర రత్నము నూతనపంథా త్రొక్కి యున్నాడు. రామదండు స్థాపించి రామసేవకులనే స్వరాజ్యసేవకులుగా జేయుటకు సమకట్టి యున్నాడు. వాలంటీరు సర్వవిధముల నెట్టి కష్టముల పాలగుచున్నాడో ఆయన తన సహజ హాస్యరస ప్రయోగ ములతో వెల్లడించెను. పురాణకాలమునాటి దధీచి, లక్ష్మ ణుడు, ఆంజనేయుడు మొదలగు వాలంటీర్లను నేడు భారత మాత సేవకొరకై సమకట్టిన సేవకుల కాదర్శకులుగా జూపెను. ప్రపంచరక్షణకొరకు దధీచి తన యెముకను ఇంద్రు నకిచ్చి ఆత్మసమర్పణ మొనర్చి యున్నాడు. దుష్టశిక్షణ కొఱకై లక్ష్మణుడు పదునాలుగేండ్లు తన సోదరునితో గూడ వనవాస మొనర్చి, వాయుభక్షకుడై యుండెను. కపివరుడు సీతాన్వేషణ మొనర్చి శ్రీరాముని యుద్ధమునకు దింపుటచేత రావణసంహారము జరిగినది. వేయేల, వానరబృంద మంతయు దుష్టశిక్షణకై సమకట్టిన స్వచ్ఛంద సేవకులే. నేడు ఆంధ్ర

రత్నమును, ఆతని యధ్యక్షోపన్యాసమున భారతస్వరాజ్యలక్ష్మి నన్వేషించుటకై ఆత్మార్పణము సేయ సమకట్టిన స్వచ్ఛంద సేవకగణమును రామదండును వెంటనే స్థాపించుట ఆంధ్రుల పరమధర్మమని స్పష్టపఱచెను. జాతీయచిహ్నములు, జాతీయతను వ్యక్తిపఱచు నామములు, ప్రజలలో నుత్సాహమును గూర్చుననుటకు సందియములేదు. అకాలీలలో గల పట్టుదలకు కారణము మతావేశమే. అట్లే రామదండుస్థాపన వలన మతావేశముచే నెక్కువ పూనికతో హిందువులును జాతీయతను పెంపొందించుట నిస్సంశయము. కావున గోపాల కృష్ణుని యుపన్యాస మత్యాదరణతో గ్రహింపబడెను. అధ్యక్షోపన్యాసానంతరమున నొక్కటే తీర్మానము రామదండు స్థాపనను గూర్చి డాక్టరు సుబ్రహ్మణ్యంగారిచే ఉపపాదింపబడి యేకగ్రీవముగా నామోదింపబడెను. 4 గంటలతో సభ ముగింపబడెను. రామదండు స్థాపనగూర్చి బహిరంగసభలలో నుపన్యాసము లీయబడెను. అనేకులు రామదండునందు చేఱిరి. శ్రీ వ్యాసరునందు త్వరలో దళనాయకులకు శిక్షాశిబిర మేర్పరుపబడునని చెప్పిరి. శ్రీమద్రమారమణ గోవిందోహరి యను ధ్యానముతో నెల్లరును సభాభవనమును వీడిరి.

—'కాంగ్రెసు'

—* శ్రీమద్రమారణగోవిందో హరిః. *—

# గోదావరీమండల స్వచ్ఛందసేవాసభ,

## ఆలమూరు.

(ది 2–5–1924)

అధ్యక్షులగు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి

## ఉపన్యాసము.

శ్లో॥ ఆత్మా త్వం క్షితిజా మతిః పరిజనాః ప్రాణాః శ్శరీరం గృహం
క్రీడా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం రామాఽస్తు తే పూజనం॥

శ్లో॥ సర్వారిష్ట నివారకం శుభకరం పింగాక్ష మక్షాపహం
సీతాన్వేషణ తత్పరం కపివరం కోటీందు సూర్యప్రభం
లంకాద్వీపభయంకరం సకలదం సుగ్రీవసన్మానితం
దేవేంద్రాదిసమస్తదేవవినుతం కాకుత్స్థదూతం భజే॥

శ్రీమ ద్రామకార్య నిర్వహణదీక్షాపరులగు నీ సభాసదుల సన్నిధి తత్సేవావిధాన వివేచనముగావించు నవకాశమబ్బినందులకు సంతసించుచున్నాను. ఐచ్ఛికభటులవిషయము నిర్మాణ కార్యక్రమమందలి ముఖ్యాంశములలో నొకటిగా నెంచబడుచున్నది. స్వరాజ్యమునకై భారతజాతి యర్పింప

నున్న వివిధబలిదానముల యందలి శ్రేష్ఠతరమగు నరబలికి వలయు వస్తుసంపత్తి సమకూర్చుటయే యిందు ముఖ్యవిధి. ధర్మ సంరక్షణార్థము ప్రాణార్పణము జేయ సాహసించు మహోదారమార్గము మనుజాంతఃకరణముచే వరింపఁజేయ దుర్ఘటము. స్వభావభేద మిందుకు గారణము. ప్రతిజీవియు నిజస్వభావానుసరణముగా స్వధర్మానుష్ఠానమునకుఁ గడంగు చుండును. సమిష్టి ధర్మమును వ్యష్టిధర్మముతో సమ న్వయము జేసి బోధించినగాని యే జీవియు నిష్కామధృతితోఁ గార్యకారి కానేరదు. జాతిధర్మమును బోషింపవలసివచ్చి నప్పుడు భటుడు సంపూర్ణశిక్ష నొందుట కవకాశము లేకపోయినను తగు సహాయసంపత్తులు లభింపక పోయి నను వస్తుతః శక్తిసమర్థతలు గలిగియుండక పోయినను యథాశక్తి విధి నిర్వర్తించుటకు నిశ్చలమైనదీక్షనైనను గలిగి యుండవలయును. భటవృత్తికి స్థితిగతుల యానుకూల్య ప్రతి కూల్యతలు గమనింప నధికారములేదు. భటకర్మానుష్ఠానము ఫలావాప్తినందకయే పంచత్వము నొందవచ్చును. పునస్సం ధానపుణ్యకాలమునకుఁ బూర్వము ప్రాతపత్రముల విసర్జించు పాదపములభంగి పునరావృత్తినాశించు జాతి నిజభటావళికి బ్రతిఫలముగ బంచత్వమునైన బ్రసాదింపసాహసించు నిజ ధర్మనిర్వహణార్థము జాతి తనభటకోటిని మెట్టియిక్కట్టుల నైన బాల్పడజేయ వెనుదీయదు. నిజబలోపలబ్ధికిఁ బడు శ్రమ వలన నుద్భవించు స్వేదాంభఃకణజాలమునువలె తన భట కోటిని నిజధర్మనిర్వహణ సమయమునం దూడ్చిపుచ్చ వెను

దీయదు. భటుడెప్పుడు నభోక్తయె. కాని యశోవిశిష్టమైన యభోక్త. జీవుఁడుయథార్థముననభోక్తయె. ఫలానుభూతి జన్మాంతరమునగాని, దశాంతరమునగాని లభించుగాక. జీవుఁడు జీవత్వమును ద్యజించినగాని యమరత్వసిద్ధి నందనేరడు. భటునియొద్ద నిట్టి మహాత్యాగము నభ్యర్థించుచున్నాము. ఒక సంప్రదాయమును పెంపొందించుటకై, ఒక పరమార్థమును సాధించుటకై నిద్రాణమైయున్న యొకజాతిని ప్రబుద్ధము గావించుటకై జగత్కుటుంబియొక్క ప్రజాసంసారమును నిలువబెట్టుటకై నీ భటావళిని సర్వసమర్పణ మాకాంక్షించుచున్నారము. లోకకళ్యాణార్థము అమరభర్తయొక్క వజ్రాయుధ నిర్మాణమునకై, త్యాగాగ్ని సంస్కారమున నస్థిమూర్తియై యనుగ్రహించిన దధీచిమహర్షియొక్క స్వాంగదాన ప్రసాదమెట్టిదో, పదునాలుగు వత్సరములు నిద్రాహార వివర్జితుఁడై తుదకు రణస్థలి ప్రాణాంజలి నొసంగిన రామానుజుని సేవావిధానమెట్టిదో! ధర్మరాజ్య విజృంభణార్థము క్రీస్తుదేవుఁడొనర్చిన బలిదానమెట్టిదో! గురువాటికయం దాత్మసంయమావిర్భావసమయమునందు బంచిపెట్టిన యకాలీసాధకుని ప్రేమామృత ప్రసాదమెట్టిదో యట్టి యుదార సంపన్నత యీ భటావళియం దూహించుచున్నారము.

ఇది స్వల్పవిషయమా? జాతీయవ్యవహార సంరంభసంభ్రమముల నుప్పతిల్లు వీరావేశతరంగముల నోలలాడు బుద్బుదాడంబరమువంటిదా? విత్తమునకుగాని, విన్నపమునకుగాని విక్రయ సాధ్యమా? మనకు వేనవేలు భటులు కావలయును.

ఎట్లు లభింపగలరు ? లభించిన నెట్లు నిలుపుకొనగలుగుదుము?
కాంగ్రెసు నిరంతరము వారికై కనిపెట్టుకొని యున్నది.
నాయకులు సదా వారికై దేవులాడుచున్నారు. మహాత్ముల
వారు సైతము వారి నన్వేషించుచున్నారు. ఫలముమాత్రము
మృగ్యముగ నున్నది. జాతియందు నిర్మలాంతఃకరణులును,
బలసంపన్నులునగు నేకొలదిమందియైనను ధర్మసేవకు దృఢ
ముగా సంకల్పించిన యుత్తరక్షణము నిరాయాసముగ
స్వరాజ్యము లభింపకుండునా? జేగంటమ్రోగుచున్నది. సం
ఘముమాత్రము సంశయించుచున్నది.

నిర్మాణకార్యక్రమమునందలి వివిధాంశములకుఁబట్టిన
తెగుళ్ళును, చీడలును దీనియందుగూడ గనుపించుట చిత్రము.
నడపువారు నాస్తి; కావలసినవారు కఱవు. అంతరంగములో
ననుమానము. వేగలేక విసుగు. చిక్కుబడిన సిద్ధాంతాలు;
చెక్కుచెదరని చాదస్తము; మితిలేని మీమాంసలు; గతి
గానని కాంక్షలును; ఇతరాంశములమాదిరి యిందులోను కొన్ని
విజయఘట్టాలు; కొన్ని యపజయఘట్టాలు; దేశములోనున్న
ప్రతిపార్టీయును వారుచేయు ప్రతితీర్మానమును భటసంపా
దనను ముఖ్యకర్తవ్యముగా తేల్చడము. అందుకు ద్రవ్యమును
ప్రత్యేకించడము, కమిటీలు బనాయించడము. కాన్ఫరెన్సులు
సాగించడము, స్వరాజ్యమున కిదియే ప్రధానసాధనమని ఘో
షించడము. అన్నిలక్షణములకు గొదువలేదు. అయిదువ
తనము మాత్రము అపరూపము. ఎందువలన నీఘోరస్థితి? మన

మనస్సులను వశపరచుకొనుట? మనుష్యులను లోబరచుకొనుట దుస్సాధ్యమే యగుగాక. మన కిది తప్పునా?

భటవర్గమున జేరుమని కోరునప్పుడు కొందరు అభిప్రాయభేద మను నతిసులువుదారిని అవతల బడుచుందురు. కొందరు తిలకు స్వరాజ్యనిధికింద తిరిపెము బెట్టి తద్ద్వారా దాటుదురు. కొందరికి అంతుపొంతు కనుబడని యసందర్భాలు. కొందరు గొప్పవార మనుకొని వెట్టివాలంటీరువృత్తికి వెలుస్తారు. కొందరు కాన్ఫరెన్సులకు కథానాయకులు. కమిటీలకు గ్రంథకర్తలు. కనబడనిపని, తెలుపిలేని తిరుగుడు. వగలు, దిగులు, వాలంటీరుపనికి తీరదు. కొందరికి గొప్ప కుటుంబాలు. కొందరికి గొప్ప పత్రికాసంసారాలు. కొందరికి గొప్ప ఖద్దరు వ్యాపారాలు. కొందరికి జాతీయ విద్యాలయాలు. భటకర్మ కొందరికి అంతు తెలియనిది. కొందరికి వృథాయాసముగ తోస్తున్నది. కొందరికి నిష్ప్రయోజనముగ గనుపట్టును. ఇది యింతేనేమోయని అనుమాన మందరికి ఉన్నది. ఇక దానివలన గలుగదగు యమబాధ తెలిస్తే అందరిగుండెయు ఝల్లుమంటుంది. ఇంతటితోనే గాదు. బూటకపు ప్రేమజూపు బుద్ధిమంతులు, కపటపు కారుణ్యము కనబరుచు గ్రంథసాంగులు ఈ స్థితిని మఱింత బలపరచుచున్నారు. కాస్త పని, యిరవై రూపాయలకు గంతువేస్తూ జయిలుకువెళ్ళే వెఱ్ఱివాలంటీరని, కళాకాంతులు లేని కౌన్సిలు కాస్తంత కదలబారుటకు వెక్కిరింతలతో విచారిస్తూవుంటాడు గవర్నమెంటు ఉద్యోగి. వాలంటీరుకున్న తూలుడుకు తాను

అపరాధము చెప్పుకుంటూ అతను పడు కష్టములను గూర్చి వ్యతిరేక సవాళ్లతో గవర్నమెంటును గాబరా జేయ జూస్తాడు మితవాది. జైలుకుపోయే వాలంటీరు చెప్పరాని పాపము చేశాడని దానిని తప్పించి ధన్యుడగుటకు పాతపాప్రియిశ్చిత్తాలు వెదుకడానికి పాతతాటాకులు వెదుకుతూ వుంటాడు పౌరోహితుడు. ఒకుంబడిలేని వాలంటీరు కుటుంబానికి ఉపాధి యెట్లు కల్పించడమా యని వాని కుటుంబస్థితి సంతా వాదిస్తూ కాలక్షేపము జేస్తూ వుంటుంది కాంగ్రెసు కమిటి. ఇక వీరి చర్యలకు వేదోక్తమైన యాశీర్వచన మిస్తూ గోరంతలు కొండంతలు చేసి పేపర్లనిండా కొనియాడుతూ వుంటాడు పత్రికా కరెస్పాండెంటు. కాస్త సిగ్గుపడుతూ అనుమానిస్తూ ఆలోచిస్తూ, ఆశిస్తూ అడుగుపెట్టే వాలంటీరు వీరందరి వికృతానుగ్రహముచేత వికలమనస్కుడై వెనుకంజ వేయడం తటస్థిస్తూ వుంటుంది. వీటన్నిటిని మించిన పెద్ద సందేహము మఱియొకటి. నిజప్రాణోపద్రవకరమును, ప్రబలారిష్టహేతువును, భయంకరము నగు భటకర్మానుష్ఠానము ఇష్టదేవతకు గాని, సమమిష్టిదేవతకు గాని ప్రీతిజనకమగునో కాదో అను మహాసంశయము మరింత ప్రతిబంధకము. దేశాభిమానము వ్యవహారవాంఛ కలుగజేయును. ధర్మాభిమానము, త్యాగోన్ముఖత గావింపవచ్చును. కాని, జాతిధర్మముయొక్క లక్ష్య లక్షణములతో నిజధర్మమున కనన్యత్వము కలదను జ్ఞాన సంపత్తి లభించిన యెడల నిష్కామదీక్షాకలితమగు భట కర్మాచరణము సాధ్యమగును. ఇట్టి జ్ఞానసంపన్నులు మన

కెంతవరకు లభ్య మయ్యెదరు? భటవృత్తి నర్థించు వారికి జాతీయ ధర్మసంస్థాపనమే పరమపురుషార్థమని మన మెట్లు బోధింపఁ గలము? నాయకు లందఱు రట్లు వర్తించుచుండిరా? మన మెల్లరము మన సర్వస్వమును సమర్పించియుంటిమా? లేనిచో నింకొకజీవిని తన సర్వస్వమును సమర్పింపు మని యెట్లు ప్రోత్సహింపగలము? భటాన్వేషణము గావించుటకు సర్వసమర్పణము గావించిన యుత్తమాధికారికి తప్ప నితరులకు సాధ్యమా? అట్టియుత్తమాధికారులు మన కెంతమంది గలరు? జాతీయవ్యవహారము కొందరము వేడుక విషయముగాను, కొందరము కాలక్షేపముగాను, కొందరము లోకము మరామతుకుగాను అనుష్ఠించుచున్నయెడల మన మాచరించు ధర్మసంగ్రహలేశముతో కామక్రోధాది వర్జితులముగాక విధ్యుక్తధర్మమును బాటింపక డంబమునకై యత్నించి లోకసంగ్రహలేశ మాచరించి సరిపుచ్చుకొనుచున్నంతకాల మింకొకరిని సర్వసమర్పణము గావింపుమని యెట్లు వచింపనేర్తుము? తన కెందరు సహాధ్యాయు లగుదురో తనశ్రద్ధాభక్తులు, తన త్యాగపరిమితి ననుసరించి విచారించి తేల్చుకొనవలయును.

సర్వలక్షణ లక్షితులగు భటసంధాయకులును, భటులను సమకూర్చుటయు, నియమించుటయు ప్రకృతజాతిధర్మసంస్థాపనము ఇహపరసాధకము, పరమపురుషార్థము అను నిస్సంశయములగు శ్రద్ధాభక్తులను భటాంతఃకరణముల నాటుటయు, సర్వప్రాణిసమత్వమును, సోదరవాత్సల్యమును భటవర్గమునందు నిష్కళంకముగ బెంపొందించుటయు నిర్మాణ

కార్యక్రమమునందలి (ఈ యంశమునకు) ప్రధానవిషయ ముగా గుర్తింపనగును.

ఈ భటోద్యమముయొక్క చరిత్రాంశముల వివరింప నవసరములేదు. ఉద్యమము ప్రారంభమై విశేషకాలము గతింపనందున దాని వివిధావస్థలు మీకెల్లరకు విశదముకాక పోలేదు. లఘువుగానైన స్మరించెదము గాక. ఈయుద్యమ ముత్తమసంప్రదాయమున నుత్పన్నమైనది. ఉత్తమాంశమున నవతరించినది. దీనికి "జై మహాత్మాగాంధీ" అను షడక్షరియు, "శ్రీమద్రమారమణగోవిందో హరిః" యను ద్వాదశాక్షరియు మంత్రములు. ఇందుకు ఋషులు దధీచి, లక్ష్మణస్వామి, క్రీస్తుదేవుఁడు, బుద్ధుఁడు ఇత్యాదులు. విశ్వవిఖ్యాతకీర్తియు, పురుషోత్తముండు నగు శ్రీగాంధిమహాత్ముఁడు దీని కధిష్ఠానదేవత. వేదమాతయే ఛందస్సు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యను భగవదాదేశమే బీజము. "సర్వం రామార్పణ" మను నది శక్తి. సర్వం రామమయమ్" అను నది కీలకము. "స్వరాజ్య సంపాదనమే" విని యోగము. అంగన్యాస కరన్యాసములు ప్రత్యక్ష భగవతి యగు భూదేవి ధర్మకైంకర్యమునందు వ్యాప్తములు. భటావళికి జ్యేష్ఠభ్రాతయు ఆమహామహుఁడె. ఈమహోద్యమము వర్తమాన సేవాదళము లన్నిటిని నిజప్రతిభచే నిప్పటికే నిస్తేజులను గావించినది. అందు ముఖ్యముగా హిందూస్థాన సేవకసమితిని(Servants of India Society)నామావశిష్టము గావించినది. ప్రతిభటుఁడును హిందూస్థానమునకు సేవకుఁడె.

సర్వభూతసేవయే పరమావధిగఁ బరిగణించుచున్నప్పటికి, హిందూస్థానము మట్టుకుమాత్రమైన ప్రస్తుత మాతనిసేవ నడుచుచున్నది. అప్రాచ్యాచారముల ననుష్ఠించు మితవాదసేవకునివలెగాక స్వసంప్రదాయ చోదితములగు ననుష్ఠానక్రమముల నాదరింప నూహించుచున్నాడు. సేవాసంవిధానమునందు ప్రాచ్యాప్రాచ్య పద్ధతులయందు వ్యత్యాసము విశేషముగా గలదు. సేవకునికన్న సేవితుఁ డతిశయస్థాన మాక్రమించుట విమతమార్గము. మనలో ప్రభువుకన్న దాసుఁ డుత్తముఁడు. దాసునికన్న దాసానుదాసుఁ డుత్తమోత్తముఁడు. మన యనుష్ఠానక్రమమునం దామర్యాద యింకను అవతరింపకున్నప్పటికి కాంగ్రెసురాజ్యమున వాలంటీరింకను వెట్టి వాలంటీరుగాఁ బరిగణింపఁబడుచున్నప్పటికి గాంధీమహాత్ముఁడు భారతభూమికి నమ్మిన బంటుగా నున్నంతకాలమును, భవిష్యన్నియామకుఁడుగా నున్నంతకాలమును ఆయన ప్రవృత్తిమార్గము భారతాంతఃకరణమును శాసించుచున్నంతకాలమును ఈమర్యాదయం దాదరణ తగ్గదని విన్నవించుచున్నాను. ఇంతియేగాక, మనయొక్క నాయకుల నెన్నుకొను మార్గము ఉపాస్యుల నన్వేషించుపద్ధతిగూడ ప్రాచ్యవిరుద్ధమే. విష్ణుమూర్తిని తన కుపాస్యునిగా నంగీకరించు సందర్భమున భృగుమహర్షి యాచరించిన అతిసుకుమారమగు తన్నుల పద్ధతిని బోలి యెన్నికలు గావించుకొనుట మన సంప్రదాయము. తన్నుల దిన్న వెన్నదొంగ తాను నిద్రించుచున్న యపరాధమునకు క్షమాపణ వేడుచు పరీక్షయందుఁ దన

ను త్రీర్ణుని జేయ వేడుకొనెను. ఎట్టి పాపాత్మునినైనను గడుపులో
బెట్టుకొని తన సంసారపుగుట్టును జెడగొట్టుకొనని పరమగృహ
స్థధర్మమును బ్రతిష్ఠించు జగత్కుటుంబియొక్క కోట్యంశ
మైనను సంక్రమించని పురుషుఁడు మనకు నాయకుఁడుగాని,
యుపాస్యుఁడుగాని కానేరఁడను ధర్మసూక్ష్మము మన సంప్ర
దాయసారము. కపటవినయములు, కడుపునిండిన త్యాగములు
గావించు డాంబికుల యెట్టి కార్యావసరము లున్నను "యాం
చ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామాః" అను
ఆర్యోక్తి ననుసరించి, డాంబికుల నాశ్రయింపక కుచేలునివంటి
పేదరికము, విదురునివంటి జాతిహైన్యత, దుర్వాసుని దురాగ్ర
హము, విబుధాధిపతియొక్క వ్యభిచారమును, రామదాసు
గోపన్నవంటి దివాలుఖోరును, అమేధ్యముతో బూజ గావించిన
శివభక్తుని మొదలగు పతితాగ్రేసరులను పరమప్రీతితో
బాలించి నిజసంసారమున నాదరించు బహుకుటుంబినిబోలిన
పురుషపుంగవు నెవ్వరినైన నెన్నుకొనజూచుట మనమర్యాద.
ఇదిగూడ లవలేశమైనను మన యాధునికానుష్ఠానమునం దింత
వరకు సంక్రమించి యుండకపోవచ్చును. ఇందుగూడ మహా
త్ముని నాయకత్వమే మనకు అనుకూలహేతువు. తనకు యజ
మాని గావలసినవానియాజ్ఞలు నిజధర్మవిరుద్ధములుగా నుండి
నచో సత్యాగ్రహమైన యాచరించి స్వధర్మమునకు యజ
మానుని ప్రసన్నుని జేసి వశపరచుకొనజూతుముగాని అవసర
మున్నదని యధోగతిని సైతే మనుష్ఠింపఁబాల్పడుటకు వెర
తుము. ఇంకొక విశేషము గలదు. విమతమార్గమునందు ఆచ

రించిన సేవకు అనువైన యాహుతి నాశించుట విధాయకము. వేనవేలు జీతము పుచ్చుకొనుచు విధి నిర్వర్తించు విమతసేవకులు స్వార్థత్యాగము చేయుచున్నామని తెలియఁ బరుచుకొనుట మనమెల్లప్పుడు వింతగా వినుచున్నాము. పేదతికముచే జీవయాత్రనిమిత్త మేస్వల్ప వేతనమో పరిగ్రహించిన వాలంటీరు ప్రతిఫలసామంజస్యమునుగూర్చి పరిదేవన మాచరించుట తగదని యెరుంగును. తన మార్గము నిష్కామసాధనమనియు, లోకసంగ్రహ మయాచితముగనే యాచరింపవలెననియు "పద్మాకరం దినకరో వికచీం కరోతి చంద్రోవికాసయతి కైరవచక్రవాలమ్। నాభ్యర్థితో జలధరోపిజలం దదాతి సంత స్స్వయం పరహితేషు కృతాభియోగాః" అనునట్లు లోకసంగ్రహమునకు సూర్యచంద్రమేఘాది సత్పురుషు లెట్లు వాలంటీరుపని నిరంతరమును జేయుచుందురో అట్లే అయాచితముగ నిరాకాంక్షిత ప్రతిఫలముగా నిరంతరము సేవయొనర్చుచుండవలెననియు నెఱుంగును. తా జేయు శ్రమకు, సేవకు ప్రతిఫల మేమియు కాంగ్రెసునుండి పుచ్చుకొనగూడదను భటప్రతిజ్ఞ (అహమ్మదాబాదు ప్లెడ్జి) యిందుకు దార్ఢ్యాణమై స్వసంప్రదాయమును విస్మృతిజెందిన వాలంటీరునకు జ్ఞాపకము దెచ్చుచున్నది. విమతమార్గముల ననుసరించు నితరసేవాసమితులలో బాలభటోద్యమమునుగూడ యీ మహోద్యమము నామావశిష్టము గావించినది. వారి వేషభాషాదుల వైఖరిని విసర్జించి "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అను కుచేల సౌభాగ్యమే యనుష్ఠేయమని యంగీకరించి

నది. వారియన్వేషణము (Scouting) ను ఖండాంతరముల కేగిన స్వారాజ్య లక్ష్మి యన్వేషణముగా నన్వయపరివర్తనము గావించుకొన్నది. ఆ బాలభటులు భారతభూమి నిస్సారమైన కారణముచే గాబోలు నెల్లప్పుడును బాలురుగనే యుండుటచే ఖండాంతరములయందువలె బాలభటులు, సైనికభటులు కాతగ్గ యోగ్యత భారతభూమిని లేమిచే బాలభటులను కబళించి కాంగ్రెసు భటులుగాఁ జేసి వ్యవహరించుచున్నది. ఈ మహోద్యమమున కిప్పటికి మూడువత్సరముల ప్రాయము. ఇంతవరకనేకధర్మసంగ్రామములలోఁ బాల్గొన్నది. భటార్భటి సర్వతోముఖముగ విజృంభించినది. సురాపాన పిశాచమును నిర్మూలన(?)ము గావించినది. విదేశవస్త్ర ప్రవాహము నరికట్టినది. క్రిమినలు లా ఎమెండుమెంటు అక్టు ప్రేరణచే జయిలుభూముల సాగు చేసినది. నాగపూరు పతాకప్రతిష్ఠ నిలువబెట్టినది. అకాలీవీరుల నావహించి నిజధర్మ నిర్వాహణార్థము మహాప్రస్థాన మారంభించి విజయవిజృంభణము గావించుచున్నది. “సర్వం రామమయ” మను పరమార్థమును వైకమునం దిప్పుడు వ్యాఖ్యాన మొనర్చుచున్నది. పర్వదినముల యందు హరితాళముల సాగించుటయందేమి నారాయణస్వాహపములకు నిట్టి మహాజన నమావేశములందేమి నిరంతర సేవాపరిచర్యల ననుగ్రహించుచున్నది. స్వపక్షప్రతిపక్షుల యాదరణాతిశయముల నందినది. ఈ భటులు అయఃకవచధారులు (Steel frames) ముప్పదివేల భటులు జయిలుదుర్గములను స్వాధీనము గావించుకొని తమ యుద్యానవాటిక

లుగా రెండు సంవత్సరములు విహరించిరి. విపక్షశత్రుఘ్నుల మారణసరసము నాస్వాదింపగల రసికులైరి. రణాంగణమున నహింసాఖడ్గధారులై, ముక్తికాంతాసమాగమమునకు వేచి బద్ధోళిపరివర్తనకారణమున నట్టిసమయ మేతెంచకునికి రిక్త మనోరథులై దీనభావముతో గాలయాపనము చేయుచున్న వారుకూడ కొందఱు కలరు. వీరికిట్టి యుదారసాహసములను, ధైర్యస్థైర్యములను ఆకాలమున గలుగజేసిన ప్రధాన ప్రేరణాంశమెద్ది? అనేకశతాబ్దములు పిఱికిపందలై నేటికి హఠాత్తుగా శూరాగ్రేసరు లయిరా? అంతఃకరణమున నత్యంతాందోళనము గావింపఁగల స్థితిగతులును, కేవలదృష్టిప్రసారమాత్రమున మతిమార్చఁగల మహానాయకుఁడును లభింపనిదే గలిగెనా? అట్టి స్థితిగతులు సంవత్సరములో స్వరాజ్యము అను మహాత్ముని మేఘగంభీరధ్వానము యావద్భారతాంతరంగమును గల్లోల పరుపలేదా? అజాతశత్రువై, నిఖిలకల్యాణగుణ సంపన్నుఁడై యవతరించిన యీమహాత్ముని ప్రతిభావిశేషము చేగదా మతులుగూడ మారిభీరువు శూరుఁడై లోభి దాతయై, శత్రువు మిత్రుఁడై యిట్టి మహాత్కార్యముల సాధింపగలిగినది! ఇప్పుడో మహాత్ముఁడు తిరిగి లభించెనుగాని సంవత్సరములో స్వరాజ్యమను ప్రబలప్రేరణాంశము గానరాదు. ఉపాదానకారణము మాత్రము ప్రస్తుతము లేదు. నిమిత్త కారణము మాత్రము గలదు. ఉపాదాన కారణము మునుపటిదే తిరిగి నుపపాదింపనగునా? లేక క్రొత్తది యన్వేషింపవలయునా? మునుపటిది నిష్ప్రయోజనమని మహాత్ముని

వాగ్వైఖరియే తెలుపుచున్నది. నిర్మాణకార్యక్రమము సానుకూలమైనగాని విజయవాంఛ మన కనర్హమనిగదా యందు ముఖ్యాభిప్రాయము? ఇక లక్ష్యాంతరమెద్ది?

అకాలీవీరునికి, ఖిలాఫత్ గాజీకి ఆత్మార్పణమునకు వలయు ప్రేరణాంశము వారి మతధర్మమునందు గల శ్రద్ధాభక్తులే. అప్పుడే నాగపూరులో జరిగిన జండావ్యవహారమందు భటులకు పూర్వమందు గల ఆవేశానుభవము తగ్గి సంఖ్యకూడ వేలు పదులై తగు ప్రేరణాంశము లేమి క్షీణస్థితి దెలిపినది. వెనుక అపస్వరములను సుస్వరములనుగాఁ జేసి, సంశయము నిస్సంశయముగా జేసి, భేదము నభేదముగా వించి యప్రతిహతమై విజృంభించిన భారతభటతాండవము నాగపూరునందు నడకను నేర్చుకొనజొచ్చెను.

నిర్మాణ కార్యక్రమమున కారంభదశ యిట్టి మహాప్రస్థానమున కంత్యదశగా కూడఁ బరిణమించినది. భటునికి గూడ భావసాంకర్యము, భావదైన్యము లేర్పడినవి. స్వరాజ్యము అనిర్దేశ్యముగ గన్పట్టుచున్నది. కాంగ్రెసు వ్యవహారము దీక్షాస్ఖాలిత్యములచే, అంతఃకలహములచే జ్ఞాతివైరుధ్యములచే పరస్పరద్వేషములచే, బహునాయకత్వముచే సాహసశూన్యతచేఁ గ్రమక్రమముగా విచ్ఛిన్నమై యధోగతి జొచ్చినది. భటకర్మమాత్రము మఱింత యవసరముగాజొచ్చినది. పురరక్షకులు (Civic guards), శాంతి సంధాయకులు, ఖద్దరు విక్రేతలు, గ్రామపరిచారకులు, అస్పృశ్యతానివారకులు, తిలకు స్వరాజ్యనిధి కలెక్టరులు మొదలగు వివిధో

ద్యోగములు చేయవలసిన యోగ మతిశయించుచున్నది. చల్లబడిన కాళ్లు, ఝల్లుమన్న హృదయములు, సందిగ్ధములైన బుద్ధులు, కళారహితములైన వదనములు తిరిగి పునర్జన్మ జెంది సంపూర్ణకళాకలితములై వ్యవహారమును నిర్ధామధామముగా చెలాయించుటకు తగు మహాశక్తి బీజసంపుటీకరము గావించి మంత్రి తంత్రము లుపదేశించిన గాని సాగనేరదు. ఉద్యమ ముపాధిమాత్రముగా నీ కాన్ఫరెన్సుల రూపముగా నిలిచియున్నది. శ్రీయుత హార్డ్డేకరు ప్రభృతులచే ప్రారంభింపబడిన హిందూస్థాన సేవాదళ మనునది కాంగ్రెసు యొక్క యాశీర్వచనమును బొంది యిప్పుడిప్పుడే కార్యోన్ముఖ మగుచున్నది. సిగ్గుజెందక యథార్థము వచింప వలసినయెడల భటస్వరూపమునకు వలయు పరికరణ సంధానము యింకను గావింపవలసియున్నది. మహాత్ముని దృష్ట్యా భటుడెట్లుండవలెనో అట్టి లక్షణము లింకను అన్వేషింపవలసియున్నది. త్వరలో కృతకృత్యుల మగుదుము గాక. అకాలీ వీరులుగాని, ఖిలాఫత్ గాజీలుగాని మన రామదండు సైనికులుగాని యీ యన్వేషణమునకు మార్గదర్శకులు కాకుందురా?

మహాకార్యములను సాధించుటకు ధైర్యస్థైర్య తేజ ఓజోబలములు సంపాదించుటకు స్వధర్మానుష్ఠానమే ముఖ్య సాధనమని సర్వజనవిదితము. మతప్రేరణచే మానవు లమానుష కార్యములనైన సాధింప సమర్థు లగుదు రనుసంగతి మన మెరుంగనిదికాదు. సర్వవ్యాపారములను శాసించుచు, సర్వ

వ్యవస్థలను సంధించుచు, సర్వసమన్వయమును ఇహపరసాధన మును బ్రసాదించి జీవయాత్రను నడుపగల సంపూర్ణశక్తి మత మునకే కలదు. మతేతరపథమున తిరిగి తిరిగి వేసారి జీవి తావసానముననైన తరింపుకై మతవిచారమును జేయుచుం దురు. అకాలీవీరు డనిర్వచనీయమైన బాధలకు లోనగుట, ఖిలాఫత్ గాజీ (శూరుడు) రుద్రమూర్తియగుట మతప్రేరణ ప్రభావముననగదా? అహింసా సర్వేంద్రియ వ్యాపార నిర్మూ లనమున సంభవించిన నిమీలితాక్షులును సుఖదీప్తుల గ్రక్కు చున్న వదనవిలాసములును ముక్తావస్థ సమీపించు సమయ మున దాండవించు త్రిపానురాగములును నేదీక్షవలన ప్రభ వించునో, విజయోన్మత్తతచే దమ రక్తారుణిత దేహముల విద్యుద్దీధితుల నీనుచు రణస్థలి తాండవించు కృపాణమూర్తులచే నివాళించు కాలానలజ్యోతులవలన వెలుగొందు హింసావైభ వమున కేదీక్ష మూలకందమో, అట్టి మతదీక్ష మన భటా వళికి బ్రసాదించినగాని కార్యసాఫల్యము గానేరదు.

మృత్యుదేవత నాలింగనము గావించుకొను సాహసము భటవరునికి తగు మతమోహము లేనిదే కలుగదు. మనమత మును ఇట్టి ప్రేరణ కన్వయింపజేయలేకపోతిమేని మన మిక యీ వ్యవహార మాపుదల జేసికొనుట మంచిది. కార్య భారమంతయు బాలభటునికిగాని, మితవాదభటునికిగాని అర్పించి యొక దండముబెట్టుట మంచిది. మునుముందు ముసళ్ళ పండుగ గలదని యెవ్వ రెరుగకపోరు. శతఘ్నులతో జెల్లాట లాడవలసిన సమయము లరుదెంచుచున్నవని తెలియనివా

రెవ్వరును లేరు. అదియునుంగాక అహింసావ్రతదీక్షతోఁ బ్రతిపక్షుని వశీకరణము గావింప సమకట్టిన మనను మనయంతు సమస్తవిధము లాహిరణ్యకశిపుడు ప్రహ్లాదున కెన్ని యిక్కట్టులఁగూర్చెనో అన్నిటిచే కనుగొననిది మనకు స్వరాజ్యావాప్త లభించునా?

ఏజాతియైనను సంపూర్ణముగా ప్రాణత్యాగమునకు సమకట్టకుండ స్వతంత్రము సంపాదించెనా? ఖద్దరు వ్యవహారము సఫలీకృతమైనను ప్రతిపక్షుని మరింత క్రుద్ధు జేయుటకు మాత్ర మనుకరించును. త్రివిధబహిష్కారము సంపూర్ణముగా సాగినను విపక్షులు వీధిని బడుట తప్ప విశేషఫల ముండదు. రాజ్యముయొక్క తాళపుచెవులను రప్పించుటకుగాని ప్రతిపక్షుని హృదయమున ప్రేమ నాటి ప్రసన్నుని జేసికొనుటకు గాని ముఖ్యపరికరణము భటుడే. మతప్రేరణ, మతదీక్ష, శ్రీరామకృపచే మహోన్నతతగూడ మనమిక నవలంబింతము. మౌలానా మహమ్మదాలీగారు మన పూర్వపుణ్యముచే గాబోలు నీ సందర్భమున దమ యమూల్యవ్యాఖ్యానముచే మనకు జేయూత నొసంగ బ్రత్యక్షమైరి. వారికి మహమ్మదీయ పంథ మొదటిది. ఇతరపంథలు తరువాతవి. దేశవ్యవహారమున బాల్గొనుట దమ యిస్లాము ధర్మమే ముఖ్యకారణముగాని, మహోత్కృష్టదేశాదికము రెండవ పక్షమునకు జెందినవఁట. అది నిజమే. అది యుక్తమే.

ఆయన మార్గము మన మనుష్ఠింతుముగాక. మన మతధర్మము మనవ్యవహారధర్మముతో నేకీభూతము గావించుటకు

దగు సదుపాయములను వెంటనే వెదకుదముగాక. మన స్వరాజ్యాందోళనము మన అసహాయోద్యమము హిందువు లని పిలువబడు మనకు మతధర్మరీత్యా పరమపురుషార్థములని సిద్ధాంతీకరింతుముగాక. హిందూభటుఁడు తన అకాలీఖిలాఫతు సోదరుల భంగి మతావేశపూరితుఁడై వ్యవహారరంగమునకు దిగినచో వారిని మించినశక్తిసమర్థతలను బ్రదర్శించి విజయము సందగలడని నొక్కి వక్కాణింపగలను. అట్టి సందర్భములో వీరితో నిదివరకున్న వైషమ్యలేశములనుగూడ బోగొట్టుకొనగల సమర్థత గలిగి శాశ్వతసఖ్యము సంపాదించుకొనగలడు. తాను బలవంతుఁడై బలవంతులతో సఖ్యత చేయ నగును. తాను భేదప్రపంచమున నున్నంతకాలము, అద్వైతావధి చేరనంతకాలము మత సామరస్యము జెందనంతికాలము భిన్నుఁడై, ఖిన్నుఁడై, దుర్బలుఁడై, దైవబలమును గూడ గోల్పోయి యిప్పటివలెనే గుందుచుండవలసియుండును. కాలయాపననుమాత్రము చేయఁజనదు. అధిక సంఖ్యగల వాఁడై యింకను నధోగతిలోనుండుట తన అంతరింపు స్థితికి త్వరలోఁ జేరనుండుట. వెనువెంటనే మేల్కాంచి తనకు బలమిచ్చినది, ఐక్యమిచ్చునదియునగు సంస్కృత మత పరమార్థమును గ్రహింపవలయును. ఆఖరుకు మతోద్రేకమును, కార్యోత్సాహమును సంధింపనగు వీరాలాపములు గూడ సర్వజన సమాదరణీయములగునవి గానరావు.

"అల్లావహో అక్బర్" అను శబ్దము మారుమోగిన తోడనే ఖిలాఫతువీరు డెట్టి పనినైనను జేయించును. రణ

భూమిని శత్రుశతఘ్నికి నెదురొడ్డనునట్లు చేయగలదు. అస్పృశ్యుడైన కాఫరును సైతము ఆలింగనము చేయించగలదు. జాతీయజీవహారమునందు వేనవేలాహుతి నిచ్చుటకు "సత్ శ్రీ అకాల్" అను అమరవాణి యొక్కటి చాలును. మన రామదండుకు సైతము "రమారమణ గోవిందో హరి:" యనియు, "హరహర మహాదేవ" యనియు "దశ్శరభ" యనియు, విజయ ఘోషలు వెరిత్తించగలవు. ఆఖరుకు చెకుగుడి, కోతి కొమ్మచ్చి యందు కూయుకూతలు సహిత మత్యుత్సాహ జనకములుగా నుండును. మతప్రీతుండు కాని హిందువునకు "మహాత్మాగాంధికి జై" యను సర్వమత సమాదరణీయ మగు వాక్యముతప్ప మరియొకటి గానరాదు.

ఆంధ్రుల కిట్టి సంప్రదాయము రామదండురూపము గా గలదు. అకాలీజతలవంటివే యీ రామదండ్లు. మనయాంధ్రభటోద్యమము దీనిని ఏల స్వీకరింపలేదు ? మనకర్మమెప్పటికిని ఇంతేనా? అసహాయోద్య మారంభమునుండి యెన్ని పర్యాయములో మనవారిని రామదండు యావదాంధ్ర మండలమున నెలకొల్పుడని మొత్తుకోగా అదేమిప్రారబ్ధమో మనలో ముఖ్యులనబడువారే నా దురదృష్టముచే గాబోలు అంగీకరింపరైరి. దీనికి కారణము పరమాత్మునికే యెరుక. మహాత్ముడుసైతము దీనినెంతయో మెచ్చుకొనియుండెను. వీరికి దీని నంగీకరింప జనదని యెప్పుడును సలహా నిచ్చినట్లు గూడ గనబడదు. మౌలానా మహమ్మదాలీగారును షౌకతాలీగారును కాకినాడకు వచ్చినప్పుడు చామర్లకోట జంక్ష

నులో దిగినప్పుడు మొట్టమొదటి వాక్కు రామదండెక్కడ ? అని యడిగిరని వారిని సన్మానింపబోయిన పెద్దలును, భట వర్గమును నాకు దెలిపిరి. ఈమాటకు యిదివరకు వద్దనిన పెద్ద లేమని తలచెదరో విన కుతూహల పడుచున్నాను. రామదండును గూర్చి షౌకతాలీగారు చెన్నపట్టణము మున్నగు నితరస్థలములయందు గూడ బలువిధముల బ్రశంసించిరి. మనవారు పాటించిరా ? తుదకు గొంతకాలము క్రింద శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి యనుగ్రహమున వారి యధ్యక్షతక్రింద నెల్లూరులో జరిగిన కమిటీ సభయందు ఏదోవిధముగా కాస్తచోటు రామదండుకు కలుగజేసిరి. రామదండుయొక్క యావశ్యకత యిప్పుడైనను గమనింతురుగాక.



శ్లో॥ రామేతి వర్ణ ద్వయమాదరేణ
సదాస్మరన్ ముక్తిముపైతిజంతుః
కలౌయుగే కల్మషమానుషాణాం
అన్యత్రిధర్మే ఖలునాధికారః.

అన ధర్మమునుబట్టి ఆంధ్రదేశమందు గతానుగతికముగ 'రామదండు' అను ప్రతిష్ఠాపనము నెలకొల్పబడుచు వచ్చినది. రామశబ్దము శైవవైష్ణవాది సమస్తాంధ్రహైందవ సంప్రదాయముల కత్యంతాదరణీయమగుట 'రామదం'డను పేరును నిరాక్షేపణీయముగజేసెను. క్షామసమయములు, అరాజక సమయములు రామదండుయొక్క యుత్పత్తికి కారణములయ్యెను.

ప్రస్తుతపరిస్థితిగతులలో ధర్మసందేహము లెక్కువగుటయు, దారిద్ర్యమధికమగుటయు, బహునాయకత్వ మేర్పడుటయు, ప్రజలయం దశాంతి యతిశయించుటయు ముఖ్యముగా గమనింపతగినవి. వీనిని జయించుటకు నిదానము, వివేకము, నిరోధము, ధైర్యము, శౌర్యము, శీలము, స్థైర్యము అత్యవసరములు. అవి సంపాదించుట కాధునికులు 'స్వార్థజ్ఞానమే (Knowledge of self-interest) ప్రబలసాధన మని చెప్పుచున్నారు. ఆర్యసంప్రదాయ మిందుకు భిన్నముగ, నిరంతర మీశ్వరసేవాపరాయణత్వమే సాధన మని సిద్ధాంతీకరించియున్నది. స్వార్థజ్ఞాన ముపదేశించి ప్రజల నావేశపూరితుల గావించినచో, అందు బయల్వెడలిన యహంకార విజృంభణమువలన కొంతకార్యసాధన సమకూరునుగాని అవసరమగుపట్ల జనసమూహమును శాంతుల ప్రసన్నుల జేయుటకు మిక్కిలి కష్టమును కొన్ని కొన్ని సందర్భముల బొత్తిగా వీలుపడకుండుటయుగూడ అనుభవైకవేద్యము. రామశబ్దప్రవేశమైనచో దృష్టియందు నిలచియున్న స్వార్థపరత, ధర్మనిరూపణమవలంబించును. నాయకు లప్పుడు విశ్వమూర్తియగు మహాజనసమూహమునకు నిగ్రహానుగ్రహములు రెండును ప్రసాదింపగలుగుదురు. తాము రామశబ్దసహాయముచే ప్రయోగోపసంహారములయందు సమర్థతగలవారందరు అందుముఖ్యముగా ప్రజలు సమిష్టిగా తమలోకవ్యవహారములను జరుపవలసివచ్చిన యీరోజులలో రామశబ్దరహితమైన సమిష్టివ్యవహారము నిష్ప్రయోజనము, అనర్థజనకము, అపాయకరమునునగును.

కావున ప్రజల సంకల్పసీమల రామభక్తి బ్రవేశపెట్టినచో, వివేకము గలవారై, చిత్తనిరోధము గలవారై నిశ్చలులై, శాంతులై, కార్యసాధనకు గడంగుదురను విశ్వాసముతో ఈ రామదండేర్పాటు గావింపబడినది.

ఇంచుమించు ఇట్టియుద్దేశ్యముతోనే, బాలభట సంఘమను నొక పాశ్చాత్యప్రతిష్ఠాపన మిప్పుడు కొందరు పెద్దలచే నామోదింపబడి మన యనుష్ఠానమునకు విధింపబడినది. దాని లక్షణము లాంధ్రమహాజనుల కందరికి విదితములే. ఈ రెండింటికిగల భేదాభేదములు, యోగ్యతాయోగ్యతలును విచారించినచో మన తత్త్వమునకు యుక్తమైనది రామదండనియే తెలగలదు.

'స్కౌటు' అనుపదమునకు 'అన్వేషించువాడు' అని అర్థము. శ్రీరామచంద్రునియొక్క భాగ్యలక్ష్మి, రాజ్యలక్ష్మి యర్థాంగలక్ష్మియగు సీతామహాదేవిని యన్వేషించినవారే రామదండు. కావున పాశ్చాత్యరూపమగు స్కౌటుకు రామదండనుపదమే యోగ్యమైన ప్రాచ్యానురూపము జాతీయమునగుచున్నది. ధర్మాన్వేషణము గావించి ధర్మసంస్థాపనమునకు తోడ్పడవలసినది రామదండనియే సిద్ధాంతమగును.

రామదండు కామధేనువు. ప్రజల వ్యవహారములన్నిటియందు నిఖిలపురుషార్థసాధనయందు రామదండు ప్రయోజనకారిగ నుండును. ధర్మ విషయములు, ఆర్థికవిషయములు, రాజకీయములు, మతసంబంధములు వగైరా అన్నిటియందు రామదండుకు జోక్యము గలుగజేసికొనుటకు అధికారము

కలదు. మహాజనముమీద జరుగవలసిన కార్యములకు ప్రయోగమందేగాక ఉపసంహారమందుకూడ శక్తిసామర్థ్యములుండుట ముఖ్యముగా నవసరము. కనుక రామమంత్రి బలిమిచే గాక ఇంకొక విధముగా వీలులేదు. కావున రామదండు మార్గమే అవసరమని గ్రహింపవనగును.

ఆంధ్రమహాజనులు రామదండు విషయమున తగు శ్రద్ధవహించి యుద్ధరింప బూనవలయునని నాప్రార్థన.

ఇదితప్ప నింకొక మార్గమున మనము కార్యమును సాధింపగల మను మాట కల్ల. చీరాలపేరాలలో నిరువదివేల జనము ఇండ్లు వాకిళ్లు వదలి పదునొకండు మాసములుగా వించిన సాహసము రామదండుధర్మమువలననే యని మీకెవ్వరికిని దెలియని విషయము కాదు. రామదండుయొక్క పరమావధి మనమత పరమార్థమును బ్రదర్శించును. "సర్వం రామమయమ్" అను తత్త్వము మన భటావళికి వలయు

(౧) బలము (దేహబల మనోబల దైవబలములు.)

(౨) సంఘబలమును (అద్వైత భావముచేత సమస్త భేదములు దండు దీక్షాసమయమున మఱువవలయును గనుక) శ్రీరామచంద్రునికి విశ్వామిత్ర మహర్షి యనుగ్రహించిన "బల, అతిబల" అను మంత్రరాజ తుల్యములను బ్రసాదించ గలదు. అదియునుగాక మన మనుష్ఠింపవలసిన యహింసామార్గము పరమ భాగవత మార్గమై యుండుకతన భాగవత రూపముగు రామదండువైఖరిగల సంస్థతోగాని మన భటావళి ముక్తి నందనేరదని స్పష్టీకరింపగలను. అహింసామార్గ

ము భాగవతులకే యనుష్ఠేయమని యెఱుంగనగును. ఇది నూతనముగా మహాత్మునిచే ప్రవేశపెట్టబడినది కాదు. ఇది మన సంప్రదాయసిద్ధము. బమ్మెర పోతరాజుగారు భాగవత పురాణమునందు ద్వితీయ స్కంధములో

క॥ పొడిచినఁ దిట్టినఁ గొట్టినఁ
బడుచుందురుగాని పరమభాగవతులు తా
రొడఁబడరు మారుసేయఁగ.........

అని వివరించియున్నారు. "సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని" అను జ్ఞానము భాగవతుని యంతరంగములో నిండిన కారణముచేత విశ్వమునం దేమానవుఁడును దనకు శత్రువు కానేరడను తాత్పర్యము దృఢముగా నేర్పడును. భారతమార్గమున శత్రు ప్రతిపాదనము సహజము. అందువలననే హింస సామాన్యవ్యాపారముగ వర్తించును. హింస ద్వంద్వములోనిది గనుక విశ్వమునుండి పరిపూర్ణముగ దొలగించుట పరమేశ్వరునికిగూడ దుర్లభము. అహింసాపథానువర్తులు స్వీయాంతఃకరణము మీదనే హింసను బ్రయోగించి అమృతముతో బాటు హాలాహలమునకు సైతము చోటి య్యవలసి వచ్చిన నీలకంఠునిభంగి అహింసను ఇతరులయెడలను, హింసను తమయెడలను వినియోగించుచు అహింసావ్రతదక్షులు కృతకృత్యు లయ్యెదరు. శత్రుప్రతిపాదకమగు భారతమార్గము సైతము అద్వైతసిద్ధికి హాని కలుగజేయనేరదు.

ఇది శత్రుసాధనగా హిరణ్యకశ్యపాది దానవశ్రేష్ఠులు తరించిన రీతిగా నద్వైతసిద్ధి కన్వయింపనగును. హింసాఽహిం

సాగర్భితములగు శత్రుమిత్రసాధనలలో షోడశోపచారములు మాత్రము భేదించును. ఒకదానియం దపచారము. ఒకదానియం దుపచారము. ఉభయత్రగూడ నద్వైతతాత్పర్య మవసరముగాని యహింసయందు సువ్యక్తముగను హింసయం దవ్యక్తముగను వర్తించును. అందుచేత నహింసా సాధకులగు స్వచ్ఛందభటులకు సువ్యక్తముగా నద్వైతమును బోధించి తాత్కాలికముగానైన అనగా దీక్షాసమయముననైన నద్వైతము ననుష్ఠింపఁజేయునది రామదండుమతము తప్ప వేరొండు గనబడదు. ఏలనన, దీక్షాసమయమున 'అంతా రామమయ' మను భావముతో బ్రాహ్మణులు చండాలురతో సైతము గలసి మెలసి యుండవలసియుండును. తాత్కాలికముగానైన సంపూర్ణసోదరభావము భటసంఘములో బయలుదేరును. ఇక ప్రాణార్పణమువరకును సాహసముచేయుట యద్వైతసిద్ధివలన గాని యాతత్త్వమునందు విశ్వాసమువలనగాని లభింపనేరదు. భగవద్గీతయంతయు నిందుకే యేర్పడినది. "అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమ్" అను ద్వితీయాధ్యాయమునందలి శ్లోకపరంపర ప్రాణమందు ప్రీతిని వదలించుటకే గీతాచార్యు లుపదేశించియున్నారు. కావున అట్టి ప్రయోజనకారియైన రామదండు సంస్థ నీ మహాజనసభయందైన నంగీకరించెదరా? లేక నిష్పత్తికిగూడ మనమాచరించు పనులను యే యుత్తరహిందూస్థానపు దాక్షిణపంతుల యాశీర్వాదాంగీకారములకో వేచి యుండవలసిన దేనా?

మన భటావళినిగూర్చిన సమస్య యింకొకటి కలదు. ఇది స్వోదరపోషకవిషయము. అందఱు భాగ్యవంతులుకారు. కొంత సహాయము భటునికి జరుగవలసియుండును. ఇంతకు ముందు విచారించవలసిన విషయము భటుఁడు యావత్కాలము పనిచేయవలయునా? లేక కొంతకాలము దేశముపని, కొంతకాలము స్వంతపని చూచుకొనవచ్చునా యను సమస్య. నాయభిప్రాయము సర్వకాలసర్వావస్థలయందు భటుఁడు తన విధిని నిర్వర్తించుచుండవలసినదనియె. ప్రతిజ్ఞాస్వీకరణమునందణుమాత్ర మనుమానించక యెట్టిపనినైనను జేయుటకు సంసిద్ధుఁడై యుండవలెననియె నా తాత్పర్యము. వివిధ వ్యవహారములలో నెద్దాని యందైన ప్రత్యేకసమర్థత యున్న యెడల నయ్యది ప్రత్యేకించుకొని సాధించవచ్చును. అన్నిపనులను అన్నికాలములయందు శ్రద్ధాభక్తులతో నాచరించవలసిన భటునకు వలయుచో జీవయాత్ర యథాతథముగా సాగించుటకు దగు నేర్పాట్లు గావించవలసినది మనకుఁ బరమధర్మము. అహమ్మదాబాదు ప్రతిజ్ఞయందు భోజనముగూర్చి యడుగగూడదని యున్నదని మన పెద్దలు కొందరు చీటికిమాటికి దెప్పిపొడుచుచుందురు. కేవలము ధనాఢ్యులనే కాంగ్రెసుపని చేయుమని యా మహాత్ముని యభిప్రాయమా? బీదసాదలొసంగు ఆత్మాంజలులు భారతమాతృ మందిరమున స్వీకరింప ననర్హములా?

ఆ మహామహుఁడు ఇట్టి విపరీత మెన్నడైన నూహించునా? పైనుదాహరించినరీతి అయాచితముగా సేవ యొనర్ప

వలెననెడి ఆర్య సాంప్రదాయము ప్రతిష్ఠించుటకు పేద వారిని కాంగ్రెసు కనిపెట్టగూడదనెడి భావమెందైనగలదా? బాధ్యతలేదనిన నగుగాక. పరమధర్మమగు అన్నదానము చేయగూడదని అందెచ్చటను గానరాదే! ఒకవేళ కాంగ్రెసు తగుసంభావనము చేయలేకపోయిన సందర్భములో భటుడు భోజనములేమి విశేషబాధ ననుభవింపవలయును గనుక భటుడు పడుబాధ విశేషమైన కొలది, ధర్మార్థము వేదన అతిశయించిన కొలది, ప్రతిపక్షుని మనసు సులభముగ వశీకృతము కాదగు ననుభావముగూడ నిందు గ్రహింపబడవలయును. మొన్న ఏప్రియల్ 21 వ తారీఖున స్వరాజ్యపత్రిక యందు ప్రకటింపబడిన కాంగ్రెసు ప్రకటన తిలకింపుడు. అకాలీలకు ఇరువదియైదు వేల రూపాయలు జయిలులోబడిన వారి కుటుంబముల పోషణార్థము శాంక్షను చేసి యున్నారు.

కేవల కాంగ్రెసు వ్యవహారముకాని విషయములో భటావళి పోషణార్థమై కాంగ్రెసుజోక్యము పుచ్చుకొనుచుండ స్వంతవ్యవహారమునందు సంచరించు భటుల వ్యవహారము నాలోచింప కాంగ్రెసుకు అధికారములేదా? భటున కడుగుట కధికారములేదుగాని కాంగ్రెసున కిచ్చుట కధికారము గలదని స్పష్టముగా నెఱుంగవలయును. ఇందు నిమిత్తమై ఒకనిధిని నెలకొల్పి, మహాజనులను ద్రవ్యసహాయము ప్రార్థించవలెనని కోరుచున్నాను.

మహాజనులు ప్రాణార్పణముచేయ సంకల్పించిన భటులకు అణుమాత్రమైన సందేహింపక ద్రవ్యసహాయము చేయ

గలరని నా అనుభవమువలన గట్టిగా చెప్పగలను. ఖద్దరు బ్యాంకులకు, ఇంగ్లీషుబడులకన్న వెనుకబడిన జాతీయవిద్యాలయములకు, గాంధిసాహసముగాని, గాంధి తపస్సుగాని కానరాని గాంధి యాశ్రమములకు ఇంకను రైల్వేలకు, టిల్లిగ్రాములకు, అచ్చు ఆఫీసులకు, మోటారు కంపెనీలకు, వినియోగము కాగల ద్రవ్యమునకుమాత్రము ప్రజలు అంగీకరింపరు. ఇంతయేల, తిలక్ స్వరాజ్యనిధికి వెళ్ళినప్పుడు లేదను శబ్దము జైలుకు వెళ్లిన వానిమొగముచూచిన నంతట నాగిపోవును. విశేషపర్యాయము లిందునిమిత్తమై జయిలుకువెళ్ళిన మహాత్ములకు లక్షలే కురియును. పైన ఖద్దరు, లోపలనిద్దుర, ఒకచెంప నాన్‌కో ఆపరేషన్, రెండవచెంప కోఆపరేషన్ కల వారికి కానిడబ్బయిన పుట్టదు. కష్టపడేభటుని కుక్షిలో తమ ద్రవ్యమును వేయ సమ్మతింతురుగాని ఈద్వారా గవర్నమెంటుకు తదనుచరులకు చెందే పక్షమున ఇవ్వనెఱతురు. కావున యీ నిధిని జయప్రదముగ సాగించి ఇతర దేశములయందు రణనిధి (War- chests) యున్నట్లుగా పొందించి కృతకృత్యులు గావలయును.

భటునియొక్క వేషభాషల విషయ మింకొకటిగలదు. ధరించు దుస్తులు, జెండా, అడుగు, కవాతు, మొదలగునవి అంతర్భావమును సరసముగ వ్యక్తీకరించు నంతవఱకు ప్రయోజనకారులు. అంతర్భావమునకు, బాహ్యవేషమునకు సామరస్యమును మాత్రము జాగ్రత్తగ కాపాడవలయును. మన వారికి పరపక్ష సైన్యవైఖరియందు అత్యంత వ్యామో

హాయున్నట్లు సూచనలు గన్పట్టుచున్నవి. అహింసాదీక్ష, హింసావేషమును ధరించినచో పరస్పర సంఘట్టనముచే బాధ లతిశయించి భటుడు పతితుడు కాగలడు. యావద్భార తమునకు ఒకటే భటరూపము నేర్పరచవలెనను తాత్పర్యము గూడ సమంజసము కాదు. ఒక భావ మున్నచో ఒక భాష, అది లేనిది వివిధభాషలచే విన్నాణముగ విరచించిన భారత మాత సౌందర్యమును దుర్భ్రాంతిచే చెడగొట్టజనదు. మను జుల ముఖవైఖరిలో సైతము ఒకే రూపము శవములలో గాననగును గాని జీవులలో గానబడదు. ధర్మమునందును, తదాచరణమునందును వీలగు నంతవరకు ఏకలక్ష్యమును, ఏకలక్షణమును సాధించవచ్చుగాక! సర్వతోముఖముగ, ఏక ముచేయవలయునన్న శ్మశానమున దప్ప మరొకచోట వీలు పడదు. దీనిని ముఖ్యముగ పాటించవలయునని భటనాయకు లను ప్రార్థించుచున్నాను. పరమధర్మ మేదియని భావిం తుమో దానిచే నియమింపబడు వేషభాషల నంగీకరింపుడు. మన నాయకుడే కుచేలుడు కదా? మనకేల యిట్టి భ్రాంతి.

హిందూస్థానీసేవాదళమువారు ప్రచురించిన నియ మావళిని చూచినాను. అందు మతప్రేరణ విషయ మే మా త్రము విచారించినట్లు గనుపించదు. అది లేనిది మన యుద్య మమునకు బలమే లేదని సంపూర్ణముగ వివరించియున్నాను. అనుభవముమీద తెలిసికొనగలరని విశ్వసించుచున్నాను. అదియునుం గాక వివిధప్రాంతముల వివిధవైఖరులను పోషిం చుచు ప్రత్యేక వ్యక్తిత్వమును గమనించి దళముం గూర్ప

వలయును. అట్లు కూర్చినప్పుడే జీవకళ దానియందు గాన నగును. లేనిచో పైని వివరించినరీతి వికృతస్థితి తటస్థమగును. ఇదియు అనుభవమువలన తెలియగలరని విశ్వసించుచున్నాను. వారు భటుని తరిబీతును గూర్చి ప్రచురించిన పద్ధతులు చాల సంకుచితములుగ గన్పట్టుచున్నవి. కేవలము పొట్ట కూటికై పనిచేయు రక్షకభటునికి గావించు ట్రైనింగుపద్ధతిగా నగపడుచున్నది గాని ప్రాణార్పణముచేయ సమకట్టిన భటవరునికి తగిన పంథాగా నగపడలేదు. ఇదికూడ అనుభవము వలన సరిపడగలదని భావించుచున్నాను.

స్త్రీలు భటవర్గమునచేరు విషయమై నాలుగుముక్కలు చెప్పదలంచినాను. కాంగ్రెసు కాన్ఫరెన్సుల పనులయందు గాని అట్టి సంతోష సంరంభముల యందుగాని తమ సోదరులతో భర్తలతో సాహచర్య మొనర్చి నారాయణస్వరూపమగు మహాజన సమావేశము నారాధింప వచ్చును గాని శతఘ్నిక్రీడారంగములయందు పాల్గొనుట, తమ పురుషు లంతరించిన యనంతరముగాని వారికి అధికారము లేదు. అనంతరము మాత్రము గలదు సుమా.

జీవహారముల చరిత్ర తొల్లింటి రాజపుత్ర వెలమాది శూరాగ్రేసరుల కాలమున గలదని యెఱింగియె యున్నాము. స్త్రీకి పరమార్థము సతీత్వమని యెఱుంగుదుము. అదియు పెనిమిటి గతించినప్పుడు మాత్రమే నని గూడ ఎఱుంగుదుము. కావున వారు తగు సాహచర్యమునసే తమయొక్క సేవను వినియోగింపవలయును. స్త్రీలు ప్రకృతిమూర్తు లగుటచే

ద్వంద్వవిశిష్టములైన సుఖదుఃఖములను విశేషముగ ననుభవింప సమర్థులు. అందువలన మనదేశ మిప్పుడు దుఃఖమే ప్రధానానుభవ మగుటచేత దానిని యుక్తరీతి ననుభవించి నచో సీతామహాదేవియొక్క బాష్పబిందువు లమోఘబాణములై శత్రుముక్తికి ననుకరించినట్లు మనకది ముక్తికి సాధకము కాగలదు.

ఇంతకంటె ప్రస్తుతము నేను విన్నవింపదగు విశేషములేమియులేవు. ఈసభావిధానము మీయనుగ్రహంబుచే నిర్విఘ్న పరిసమాప్తము గావింప వేడుచున్నాను. భటావళియొక్క పరమార్థమేదియో దివ్యచిత్తమునకు దేవలయునని వేడుచున్నాను. వేనకువే లాంధ్రమహాజనులు భటవృత్తినిబూని యాత్మాంజలుల నర్పించి భారతావనిని రామసామ్రాజ్యము గావింపవలయునని ప్రార్థించుచున్నాను. ఎట్టి యిక్కట్టులు గలిగినను, పరు లెంత పరిహాసము చేసినను, తనవార లెంత నిరాదరణ జూపినను లక్ష్యశుద్ధిగలిగి యాత్మార్పణము గావింప శ్రీరామచంద్రు డనుగ్రహించుగాత యని ప్రార్థించుచున్నాను. రామానుజుని, హనుమంతుని, దధీచిని, గాంధి మహర్షిని దృష్టిపథమునం దుంచుకొని మహాప్రస్థానమునకుం గడంగెదముగాక. శ్రీరామచంద్రు డనుగ్రహించునుగాక.

స్వస్తి శ్రీరామార్పణ మస్తు.

మహాత్మా గాంధికి జై.

## గోదావరిజిల్లా
## ఆలమూరులో జరిగిన స్వచ్ఛంద సేవకసభ యందు, గావింపఁబడిన తీర్మానములు.

౧. స్వరాజ్యసంపాదనకు వలయు చతురంగబలము లలో ప్రాధాన్యత వహించిన స్వచ్ఛంద సేవాదళములను ధైర్య స్థైర్య, శౌర్య, సాహసౌదార్య, తేజ, ఓజో, బల సమన్వితుల జేసి, స్వసంప్రదాయ సిద్ధములగు నహింసాది భాగవత ప్రవృత్తిమార్గముల సర్వసమర్పణమునం దు తీర్ణులుగ జేయుటకు సర్వతోముఖమును నిహపరసాధకము నగు స్వీయ సనాతన మతధర్మము ప్రధాన ప్రేరణాంశమని యీ సభవారు గ్రహించుచు నేతద్భావ ప్రకాశితమును ఆంధ్రసంప్రదాయమును నగు శ్రీ "రామదండు" స్వరూపమే యీ సేవాదళమున కనువగు రూపమని యీ సభవారు సిద్ధాంతీకరించుచున్నారు.

౨. స్వరాజ్య సంపాదనకై వెలసిన దేశీయ మహాజన సభ నియమించిన భటానుష్ఠానక్రమము నిజధర్మముతో నన న్యత్వ మొందిన కతన నీ "రామదండు" ను మన సేవాదళము ఆ మహాసభయొక్క సమస్తములైన యాజ్ఞలను నిర్వివాదముగ, నిస్సంశయముగ, పరమ ప్రీతితో నాచరించుచు, ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘమువారు నెల్లూరునం దనుగ్రహించిన యాశీర్వచన ప్రేరణచే "హిందూస్థానసమష్టి" సేవాదళము

నకు సాంగముగా నుండుటకు ఈసభవారు తీర్మానించు చున్నారు.

3. ఈ పరమార్థమును, ఆంధ్రదేశ వివిధసేవాదళ ముల వారికిని సమర్పించి తద్విధముగ వారు అనుష్ఠానక్రమము నేర్పఱచు కొనవలయునని యీ సభవారు హెచ్చరించు చున్నారు.

౪. "రామదండు" నియమావళిని సిద్ధాంతీకరించు టకు గోదావరిజిల్లా "రామదండు" కార్యనిర్వాహకవర్గముగా నుండుటకును సంపూర్ణాధికార మొసఁగి యీ క్రిందిసభ్యుల నీ సభవారు నియమించు చున్నారు.

[ సభ్యుల నామము లిందు వదలివేయబడినవి. ]



# శ్రీ రామదండు ప్రతిష్ఠాపనము.

## కొవ్వూరు.

### ధ్వజ పూజ

మకాం కొవ్వూరు, మే 20:—నేటియుదము 8 గంటలకు దళనాయకులును భటులును స్వరాజ్యపతాకముక్రిందకు జేరి భారతమాత స్తవమునుచేసి పతాకమునుగూర్చి జాతీయ కీర్తనములు పాడిరి. జయజయధ్వానములతో పతాకము నిల్పిరి. శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్యగారు దళనాయకులను తర్ఫీతుచేయ నారంభించిరి. శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు భటపజ్త్కికి ప్రధానమూర్తియై విలసిల్లిరి. శ్రీమత్స్యవంశం వడ్డాది జగన్నాధభూపతిదేవరాజుగారి (మాడుగలజమీందారు) పుత్రులు, 10 సం॥ వయస్సుగల కొమార్తెయు, యీదళమునందు తర్ఫీతు పొందుటకు చేరియున్నారు.

పిదప ఐచ్ఛికభటదళముల యావశ్యకతను గురించి శ్రీయుత హరిసర్వోత్తమరావుగారు సుమారు 20 నిమిషములు ముచ్చటించిరి. రాట్నచక్రమొకవైపు దిరుగుచుండ ఉదయభానుడు చల్లని మలయమారుతము నిచ్చుచున్న రసాల పత్రములగుండ ప్రసరించి చూచుచుండ, శ్రీరావుగారి మధురోపన్యాసము భటుల వీనుల నాకర్షించినది. ఆంధ్రుల సంప్రదాయము ననుసరించి, హిందువుల మతసంప్రదాయము ననుస

62A

శ్రీమద్రమారమణ గోవిందో హరిః.



“రఘుపతి రాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్.”

రించి, రామనామము ప్రీతికరమైనదనియు, విదేశీయులుగూడ రాముని గొప్పవానిగా జూతురనియు, యావద్భారత దేశమునకు ప్రీతికరమైన రామనామముతో సంబంధించిన యీ దండునకు "రామదండు" అని నామమొసగబడెను అనిరి. రాముని, అనగా విశ్వముయొక్క సేవనే జేయగోరిన ఆంజనేయమూర్తి తమ పతాకమునందు ప్రధాన చిహ్నము అనియు, పూర్వపు విష్ణుచక్రము నేడు రాట్నచక్రమై ఒక చిహ్నము నేర్పడుచున్నదనియు, రామాంజనేయస్మరణమే యిహపర ముక్తిసాధనమనియు, తామందరును ఆంజనేయుని వంటి సేవయొనర్చి కృతార్థులు కావలసినదని కోరిరి. మరల కొంత తర్ఫీతు ఇయ్యబడిన తరువాత ఉదయకాల కార్యక్రమము ముగింపబడెను.

హిందూమత సంప్రదాయము ననుసరించి నేటి మధ్యాహ్నము ఒంటిగంటకు శ్రీరామదండు ప్రతిష్ఠాపనము శ్రీయుత హరిసర్వోత్తమరావు గోపాలకృష్ణయ్యగార్లు మున్నగువారిచే జరుపబడెను. జ్యేష్ఠానక్షత్రయుక్త సింహాలగ్నమునందు (1 గంటకు) శ్రీరామదండు ధ్వజపూజాదికము యథావిధిగా శ్రీరామసప్తసప్తాహము జరుగుచున్న స్థానమున భక్తిపరుడును సప్తాహ కర్తయు నగు రామదాసు అనబడెడు శ్రీకూచిమంచి మూర్తిరాజుగారి యధ్వర్యమున ఒక బ్రాహ్మణోత్తముడు పురోహితుడై వర్తింప శ్రీయుతులగు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఉన్నవ రామలింగం, గోపాలకృష్ణయ్య, వెన్నేటి సత్యనారాయణ, అయ్యంకి వెంకటరమణయ్యగార్లు,

దీక్షితులై పీఠముల నధిష్ఠింప నాంజనేయమూర్తి యధిష్ఠించి యున్న రామదండు పతాకము పూజజేయబడెను. త్రివిధ రంగులు గల పతాకముపై రాట్నచక్రమును ఆంజనేయుడు త్రిప్పుచున్నట్లును, ధ్వజాగ్రమున ఆంజనేయస్వామి కేవలము త్యాగరూపియై ముక్తి నభిలషించు చున్నట్లును, ఆపతాకము నందు జూపబడెను. దీక్షితు లైదుగురును లేఖాబంధనులై పరమభక్తితో పూజగావించిరి. ఆంజనేయ స్వామిని నిత్యము గొల్చుచుండు హరిసర్వోత్తమరావుగారు ప్రధాన దీక్షితులై సంకల్ప మొనర్చిరి. సహస్రనామపూజ జేయబడెను. వర్ణనాతీతమైన యుత్సాహ సంతోషాతిశయములతో నా స్థాన మంతయు ప్రబలెను. ఒకప్రక్కను మంత్రములతోడి పూజ, ఒకప్రక్కన రామభజన, ఒకప్రక్కన మంగళ వాద్యములు, నెల్లయెడల వందలకొలది సదస్యులు, గోవింద స్మరణములు జయజయ ధ్వానములు ఇట్టివానితో ఆ వాతావరణము చెలరేగెను.

పూజానంతరమున, హరిసర్వోత్తమరావుగారు శ్రీ రామదండు ధ్వజము నెత్తుకొని సైనికులును ఇతరులును వెంట రాగా, ప్రక్కనున్న ఐచ్ఛికభటశిబిరమున కేగి అచ్చట ధ్వజమును ప్రతిష్ఠించిరి. ప్రతిష్ఠించుటకు బూర్వము 5 నిమిషములు ఉపన్యసించుచు, నేటిప్రతిష్ఠాపనమువల్ల నూతనశక్తి వినియోగింప నిశ్చయించినామని యర్థమగు ననియు, అదియే ఆధ్యాత్మికశక్తులు వినియోగించుట యనియు, ఇవియే యెల్ల

యిష్టార్థముల జేకూర్చున వనియు చెప్పి ఈ రామదండు ఐచ్ఛి కదళము ఫలప్రదాయిని యగుగాకయని ప్రార్థించిరి.

అప్పటికి 2 గంటలైనది. కార్యక్రమము పూర్తి యయ్యెను. సాయంకాలము 3½ గంటలనుండి తంతిగుర్తులు భటులు నేర్చుచుండిరి. ఈ తర్బీతు సుమారు 2 వారముల వరకు యియ్యబడును.

—ఆంధ్ర పత్రికా ప్రత్యేకవిలేఖరి.



# ఆంధ్రరాష్ట్ర ఐచ్ఛికభటసంఘము,

కోవ్వూరు, 19, మే, 1924 సం॥ము.

## తీర్మానములు.

(౧) స్వరాజ్యసంపాదనకై వలయు చతురంగబలములలో ప్రాధాన్యము వహించిన స్వచ్ఛందసేవాదళములను ధైర్య, స్థైర్య, శౌర్య, సాహసౌదార్య, తేజ, ఓజో, బలసమన్వితుల జేసి స్వసంప్రదాయసిద్ధములగు నహింసాది ప్రవృత్తి మార్గముల సర్వసమర్పణమునం దుత్తీర్ణులుగ జేయుటకు సర్వతోముఖమును నిహపరసాధకమును నగు స్వీయమతధర్మము ప్రధానప్రేరణాంశమని యీ సంఘమువారు గ్రహించుచున్నారు.

(౨) ఆ సిద్ధాంతానుసారము వేర్వేరు మతావలంబకు లగు ఆంధ్రులు నిజమతధర్మచోదితమైన మార్గములను ననరించుటకు ప్రత్యేకదళముల నిర్మింప సంసిద్ధు లగుచు పరిష్కృతము తచ్ఛాయాప్రకాశితమును ఆంధ్రస్వసంప్రదాయమును నగు శ్రీ రామదండు స్వరూపమున హిందూస్థానసేవాదళమున కుపాంగముగా దళనిర్మాణ మొనర్చుటకు నిశ్చయించడమైనది.

67

# సప్తాహము.

1923 సంవత్సరమున కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభా సందర్భమున వచ్చెడిప్రతినిధులకు కాంగ్రెసు సప్తాహము జరుపవలసినదిగా గోపాలకృష్ణుఁడు హెచ్చరించెను. అందుపై కాంగ్రెసు ఆహ్వానసంఘాధ్యక్షులగు దేశభక్త వెంకటప్పయ్య పంతులుగా రొక ఖండన గావించిరి. అందుపై పత్రికాముఖమున ఆంధ్రరత్న మీఁ దిగువ ప్రకటనముల గావించెను. శ్రీ రామదండు సమావేశములలో సప్తాహ మొక యంతర్భాగ మగుటచే నీ విషయమంతయు నిట బొందు పరచుచున్నాము.

---

## దేశభక్తుని ప్రకటన.

కాకినాడలో జరుగనున్న దేశీయ మహాజనసభకు ప్రతినిధులుగా వచ్చువారికి నుచితముగ భోజన సదుపాయములు చేయవలెనని ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చేసిన సూచన ననుసరించుట సాధ్యముకాదని నా యభిప్రాయము. 'అధికార విరహితమగు విజ్ఞప్తివలన లేనిపోని చిక్కులు కలుగును గాన, పత్రికాముఖమున దానిని ఖండింప గోరెదను' అని సన్మాన సంఘాధ్యక్షులగు దేశభక్త కొండ

వెంకటప్పయ్య పంతులుగారు, అహమ్మదాబాదునుండి తంతి వార్త బంపిరి. సన్మానకార్యసంఘమువారు దేశభక్తుని యభిప్రాయముతో నేకీభవించుచున్నారు.

(సం) నేట్రిగంటి శ్రీనివాస కోనేటార్వు,
కార్యదర్శి,
కాంగ్రెసు ఆహ్వానసంఘము.

---

# ఆంధ్రరత్న ప్రచురణలు.

## శ్రీ దేశభక్తునికి జబాబు (4-12-23)

కాంగ్రెసుసప్తాహము గూర్చి నేను తొలుత గావించిన విజ్ఞాపనము కాకినాడ ఆహ్వానసంఘమువారి యనుజ్ఞలేకయే వెలువడెననియు, ఈ సప్తాహము జరుగుట యసంభవమనియు, మొదలగుభావములను వెల్లగక్కుచున్న శ్రీయుత దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారి తంతి నొకదానిని స్వరాజ్య పత్రికయందు జూచినాను. శ్రీవారితో సబర్మతీ ఆశ్రమమున దీనినిగూర్చి కొంతసంభాషణగూడ జరిపినాను. ఆహ్వానసంఘమువారి యాజమాన్యమున నీకార్యమును సాగింప సాహసించితినను దురభిప్రాయముతో తొందరపడి వారట్టి తంతినంపిరని తేలినది. "అట్లుకాదు. ఆహ్వానసంఘమువారి బాధ్యతయించుకేమియులేదు. ఇది మా స్వయంకృతమే. విరాళములు ముందు వారికి తెలుపకయే సంఘమువారిపేరపంపుమనుటవలన

నింత ప్రమాదము తటస్థించినది." అని యపుడే నేను "కాంగ్రెస డిక్షన్"పంపవలసినదిగా, శ్రీవా రాజ్ఞాపించిరి. శ్రీవారి తంతి జూచిన పిమ్మట, నిట్లు పత్రికలలోఁ దెల్పుట బాగుగ నుండు నని యూహించి, బొంబాయికి చేరినపిమ్మట స్వరాజ్యపత్రిక జూచి, వెంటనే ఆరీతిని నేనొక తంతివార్త నంపుకొనుచున్నాను. శ్రీవారిసన్నిధిని తమతంతి నగపరచినచో, వెంటనే జవాబు పంపియుందును. నా విజ్ఞాపనమునం దట్టి యసందర్భ ముండుట దోషమేమైనను, తలపెట్టిన కార్యమున కడుగులో హంసపాదు పడుట, అదియు శ్రీవారిచే లభ్య మగుట నాదౌర్భాగ్యము. నే నీ దురభిప్రాయద్యోతకధ్వనిని ముందుగనే నిరోధించి, తగు తాత్పర్యవివరణము గావించి యుండవలసినది. అట్లు చేయక శ్రీవారిచే నంపబడిన "కాంగ్రెసుసప్తాహ మాంధ్రదేశమున జరుగుట యసంభవ"మను నశ్లీలంపు తంతివార్తకు, హేతు భూతుడనైతిని. అవకాశము లేమియే యసంభవహేతు వని శ్రీవారియభిప్రాయము.

ముందువెనుక లాలోచించువారు, ఊహాపోహాలు లెస్సగా గలవారు, తెలివితేటలు గలవారు, అందరు శ్రీవారి యభిప్రాయమునే, యంగీకరింతురని భయము కలుగుచున్నది. రాజకార్యములు గాక రామకార్యములని వ్యవహరింపఁబడు నవి యనియు, కేవల లౌకికములగు ఊహాపోహాలు, తెలివి తేటలు మృగ్యములగు చోట్ల సంకల్పింపబడుచుండుట, సర్వ జనవిదితము. మూఢవిశ్వాసము, మొండిధైర్యము, అతి సాహసము, వెఱ్ఱి, పిచ్చి, సంపూర్ణముగా గల యస్మదాదుల

మనఃక్షేత్రములందుఁ గాక అవ్యవధిగ అన్నప్రదాన మహాకార్యము సంకల్పింపఁబడుట వేరొకచోట సంభ వించునా ! మహాత్ములవారును నొకించుక మాజాతి వాసన సోకినవారనియే యనుమానము కలుగుచున్నది. లేనిచో నొక్క సంవత్సరములో స్వరాజ్యసంస్థాపన గావింతు నని ప్రతిజ్ఞ చేయుదురా? ఎంతమంది తెలివిగలవారు ఊహాపోహ విచక్షణులు, ముందువెనుక లాలోచించువారు ఇది యసం భవమనియు, వెఱ్ఱియనియు నున్మాదమేమో యనియు జోస్యము గుణించి, తుదకు తద్దృష్ట్యా వ్యర్థ మగుటఁ జూచి మేమిదివరకు చెప్పలేదా యని పరిహసించుట లేదు, వెఱ్ఱి, వేదాంతిముత్తో కూడుకొని యుండునది, పిచ్చి, భీష్మించునది. మూఢవిశ్వాసమునకు గాఢమైన భక్తి ప్రోత్సహించును. వీని యన్నిటివలన, మొండిధైర్యము దండిగ నేర్పడును.

ఇందువలన మహాత్మునకు సంవత్సరములో స్వరాజ్య మను మతము సంభవించెను. ఆంధ్రదేశమున ధనాఢ్యులెంత మందిలేరు? వదాన్యు లెంతమందిలేరు? కాలబద్ధులు కానివా రెంతమందిలేరు ? బంధముక్తు లెంతమంది లేరు ? రామభక్తు లెంతమందిలేరు ? అంతరంగమున రాముడు ప్రవేశించి తాండవిం నచో మూడువేల ప్రతినిధులకు ముప్పూట మృష్టాన్నమిడు టకు, ముప్పదివేల రూప్యములు మూడునిమిషములలో ముడి పడవా? అన్నప్రదానముకద్దా? అతిథిసత్కారముకదా, ఆంధ్ర దేశముకదా, అని అట్టె ఆలోచింపకయె ఆంధ్రపత్రికలలో అచ్చొత్తించినాను! సాహసమైన క్షమింపుడు. ఆవెఱ్ఱిమహాత్మున

కొక పిచ్చిశిష్యుడనని యైనను గమనించి నావిజ్ఞాపనము నెడ నొకింత యోర్పుజూపుడు! యావద్భారతప్రాంతమునుండి ప్రధాన గృహస్థులు ధర్మనిర్ణయార్థ మరుదెంచిన సమయమున, శ్రీమన్నారాయణస్వరూపమగు మహాజనసభాసమావేశము కాకినాడయం దవతరించుసమయమున, అన్నవిక్రయ మాంధ్రుల కయోగ్యమని చెప్పుట కాలస్యమైన నేమి? వ్యవధిలేదా? ఆచంద్రతారార్కమీ యన్నవిక్రయపాతకము నొడిగట్టుటకు వ్యవధి గలదా? అన్న విక్రియము పాతకము కాదను నపాశ్చాత్య సాంప్రదాయమే మనకు సిద్ధాంతమా? పాతికముప్పదివేలరూపాయలు వెచ్చించి పెళ్ళిన పెండాలు వేయుటకన్న, పిండాకూడిడుటకు ఆంధ్రులకు ప్రయోజకత్వము లేదా? ఇదియేనా మహాత్ములవారి యుపదేశసారము? కాకినాడ కామహాత్ముడే అరుదెంచియుండిన, ఆయనయెడలను అన్నము పణ్యరూపము వహింపవలసిన దేనా? మునుపు, విజయవాడపుణ్యక్షేత్రమునకు ఆయన వచ్చినపుడు, అన్నవిక్రయస్థానమున కెట్టి యధోగతి గల్గెనో ఆంధ్రమహాజనులును అతిథిజనులును మఱచిరా? ఎంతపదార్థము పెంటకాల్వల పాలయ్యెను? ఎంతమంది ప్రజ లా రోజు క్షేత్రోపవాసము జేసి, స్వగ్రామములకు వెళ్ళిరి? నేను సకాలములో నీవిషయ మాంధ్రమహాజనులకు విన్నవించి యుండలేదా? ఏడెనిమిది మాసములనుండి ఆంధ్రదేశమున పలుచోట్ల పలువురతో, పిన్నలతో, పెద్దలతో పలుమారులు విన్నవించి యుండలేదా? యావదాంధ్ర గ్రంథాలయ సమావేశ సందర్భమున • నిందునుగూర్చి తీర్మానము

గూడ గావింపబడి, నిఖిలాంధ్ర గ్రంథాలయములు నీ కార్యమునకుఁ దోడ్పడవలసినదిగ హెచ్చరించియుండలేదా? కాకినాడయందే యెన్నిసారు లీ విషయమై నేను ఉపన్యాస మిచ్చి యుండలేదు? ఈ యన్నదానముఁ గూర్చి యాంధ్ర నాయకు లెల్లరు సమావేశమైన భీమవరం మహాసభయందు నేను ముచ్చటించి యుండలేదా? ఆయా సమయము లందెల్ల మా యంగీకారమును పొందియుంటివా? యను ప్రశ్న నన్నుకాదు- శ్రీరామచంద్రమూర్తి నడుగవలయును. ఈ ప్రశంస నాయకసమక్షమున జరిగినపు డెల్ల అంగీకార తృణీ కారములకు సమానవైభవము సమకూరినది. దానితో నా కెట్టి సంబంధమును లేదు. నిరంతర మీా మహాకార్యము నకు బ్రోత్సహించుటయే నా విధి. దానిని నిర్వహించుట యాజమాన్యము స్వీకరించువారిది.

యజమాను లుదాసీనత వహించియుండ ఆ దోషము నా మీాద నారోపణచేసి, నెలరోజు లైనను వ్యవధి లేకయే మహాభార మాంధ్రమహాజనుల మీాద తెచ్చిపెట్టితి నని నన్ను నిందించుట న్యాయమా?

ఆహ్వానసంఘమువా రీ కార్యభార మిక వహించుటకు వీలుకాక పోవచ్చును. వారికి రాజకార్యభార మతిశయించి యున్నది. రామకార్యమునకు నడుముగట్టగల యాంధ్రప్రముఖు లింక ననేకులు కలరనియే నావిశ్వాసము. ఆహ్వానసంఘ సభ్యులతో నయితేము పలువురు శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావువంటివార లీ రామకార్య నిర్వహణమునకు నడుముగట్ట

దలచినవా రని నామూఢనమ్మకము. వీరలు మాత్రము కాలబద్ధులు కారు. వ్యవధిలేదని వెను కడుగిడరు. కావున నిట్టి యాంధ్రగృహస్థు లంద ఱీకార్యము ప్రత్యేకించి నిర్వహింప వలసియున్నదని హెచ్చరించుచున్నాను. వలయుద్రవ్యము వసూలైన పిదప నాహ్వానసంఘము వారి కా ద్రవ్యమర్పించి, ప్రార్థించినచో, ప్రతినిధుల కుచితముగ నన్నమిడుట కనుగ్రహింతురనికూడ నాకు మూఢనమ్మకము కలదు. కావున నీ కార్య మింతటితో నాపుదల కాలేదని, యాంధ్రమహా జనులకు ఘంటాపథముగ విన్నవించుచున్నాను. వెంటనే నే నీకార్యము నిమిత్తమై, వీలగునంతవఱకు వరుస నన్ని జిల్లాలలోని ప్రధాననగరములను సందర్శించెదను. డిశంబరు ౨౦ వ తేదీ నాటికి ౨౦,౦౦౦ రూప్యములు వసూలు కావలయును. ధన రూపమునగాని, ధాన్యరూపమునగాని, ఘృతరూపముగగాని విరాళము లంప ప్రార్థించుచున్నాను. విరాళములు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి పేర బంపవలయును. శ్రీరామకార్యము వ్యర్థమగునా? అగుఁగాక! ఆలోపమంతయు శ్రీరామచంద్రమూర్తిదే. ప్రతిష్ఠాప్రతిష్ఠ లన్నియు, నాంధ్ర మహాజనులవే! ఈకార్యమే అయోగ్యమందురా? అభిప్రాయభేదములన నిట్టివేగదాయని యానందింతును. వ్యవధిలేదందురా, ముడియూడుటయు, మతిమారుటయు ముహూర్తమాత్రమైన బట్టదనిధృతి వహింతును. కార్యసానుకూల్యముకొరకు, డిశంబరు ౨౦ తేదీవరకు నిటులనే హెచ్చరించుచుందును. పెద్దలుతిట్టినను సరే, దీవించినను సరే, ఈ హెచ్చరికను మాత్రము వదలను.

సర్వతః నిరుపేద నగు నేనింతకన్న నేవిధముగా నాంధ్రభావ్యభ్యుదయమునకు దోడ్పడగలను? ఇట్టి మహాకార్యమువలన నాంధ్రుల కీభూతలమున, అనవరత మింత యనోన్నదకప్రాప్తి యనుగ్రహింప బడునని యాశించి యున్నారు. కర్మగతి యెట్లున్నదో? రామాజ్ఞ నెదిరింప నెవరితరము?

(సం.) దుగ్గిరాల గోపాలకృష్ణయ్య,
(౭. డిశంబరు, ౧౯౨౩)

౨

శ్రీ కాశీనగరమందు వేంచేసియున్న శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వాములవారు కాంగ్రెసు సప్తాహమున లవణమున కగు వ్యయము నంతను భరింతుమని వాగ్దానము ననుగ్రహించియున్నారు.

ఉప్పు, పప్పు, సంతర్పణకు ప్రధాన వస్తువులు. అందు ఉప్పు దొరికినది. ఇక పప్పు దొరకవలెను. విష్ణుస్వరూపులైన శ్రీబ్రహ్మానందస్వాములవారు ఆదిభిక్ష ననుగ్రహించినారు. ఇది చాల శుభసూచకము. ఆంధ్రమహాజను లిక వారివారి విరాళములను వెంటనే తెలియజేయ వేడుచున్నాను. ప్రతి గ్రామమును ఈ మహాసంతర్పణము నాదరించు ప్రముఖులు, ఒక చిన్న సంఘముగా నేర్పడి, ఇంటింటను సప్తాహభిక్షను వసూలుచేయ వలయును. శ్రీమంతులు వదాన్యులు నగు నాంధ్రవణిక్బృందము, మహాసంకల్పము చేయవలసినతరుణము

వచ్చినది. యావద్భారత ప్రముఖులు ఆంధ్రునింట అన్నము గొనితినవలసినదేనా? ఇట్టి విపత్తే సంభవించిన నాంధ్రభూమి తనసస్యక్షీరముల నెగజేపక మానదు. దండకారణ్యమై, అహల్యయై, బీడువారియున్న యీ యాంధ్రభూమిని, శ్రీరామచంద్రుడే మునుపు సస్యశ్యామలగా నొనర్చియున్నాడు. మహాజనసభాసమావేశరూపమున నా శ్రీరామమూర్తియే నేడతిథిగావచ్చియున్నాడు. ఆంధ్రమహాజనులారా! బహుపరాక్!!

## ౩

కాకినాడలో ౨వ తారీఖునుండి మహాభక్తులెవ్వరో, శ్రీరామయజ్ఞము జరుపనున్నారట. ఆ మహాప్రసాదము ఈ ధర్మనిర్ణయార్థ మరుదెంచనున్న, భారతప్రముఖులు స్వీకరింప నర్హులుకారా? వారు కాంగ్రెసు జరుపబడువారమున, నీ మహాయజ్ఞమును జరిగించినఁ జాల శోభాయమానముగ నుండును. వారిని స్వయముగానె ప్రార్థింపదలచుకొన్నాను.

(సం॥) దుగ్గిరాల గోపాలకృష్ణయ్య,

(౮. డిశంబరు, ౧౯౨౩)

## ౪

ఆంధ్రదేశమున పత్రికారాజము లనేకము లున్నవి. కాంగ్రెసు సప్తాహమును గూర్చి నేనిదివరకు గావించిన విన్నపముల నింతవర కెవ్వరును ప్రచురింప ననుగ్రహింప లేదు. "ఆంధ్రదేశమున కరుదెంచనున్న, ధర్మజ్ఞులగు నాయక శిఖామణులకు, అన్నముబెట్టి బిల్లు చేతికీయవలసినదేనా?" అను

ప్రశ్నమునకు యావన్మంది, ఆంధ్రపత్రికాధిపతులును జబా బిచ్చెదరుగాక. కేవల రాజకీయ విషయముల నేర్పించు పత్రికలును, కేవల మతవిషయముల నాదరించు పత్రికలును, పారిశ్రామిక సంబంధములును, కళావిలసనములును, శాస్త్ర విమర్శకములు నగు, వివిధాంధ్రపత్రికారాజములు, ఆంధ్రలోకము కాకినాడయందు సంకల్పించిన ధర్మయజ్ఞ సందర్భమున, నతిథులకైనను, అభ్యాగతులకు లేకపోయినను, ఉచితాన్నప్రదానముచేయు ప్రయత్నములకు పూర్ణోత్సాహముతోఁ దోడ్పడ వలయునని ప్రార్థించుచున్నాను. వారు తమ పత్రికలలో ప్రధాన వ్యాసములు వ్రాసి తమతమపత్రికాపాఠకులను ప్రోత్సహింపవలయును. ఆంధ్రాతిథ్యము నిష్కళంక మొనర్ప ప్రయత్నింపవలయును......కొందఱు పెద్దల కిది వృథావ్యయ మని తాత్పర్యమున్నట్లున్నది.

“ధనవ్యయమువలన లాభము ప్రత్యక్షముగా కన్పింపవలయును. సుష్ఠుగా భోజనముచేసి త్రేన్చి ‘అన్నదాత స్సుఖీ భవ’ యని శుష్కాశీర్వచనముల జేసిన లాభ మేమి? ఆడబ్బు పూట కూళ్లద్వారా ఖర్చుచేసిన కాంగ్రెసునకు లాభము.” అని వీరి యభిప్రాయము. ఇరువదివేల వ్యయముతో పెండాలు నిర్మించినందువలన ప్రత్యక్షలాభ మేమి? ఆంధ్రులబడాయిని కనుబరుచుటయేకదా? పోనిండు మిగిలినద్రవ్యము కాంగ్రెసు ఖర్చుల కక్కరకు వచ్చుననుమాటకు శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారి వాక్యములే తగినసమాధాన మొసగుచున్నవి. రైళ్లకు, టెలిగ్రాములకు పోస్టులకు పోగా

మిగిలినది కాంగ్రెసు సేవకుల అన్నమునకు, ఇంకను మిగిలినది పత్రికాఫీసులకు, అచ్చుఖర్చులకు, కలములకు కాగితములకు వినియోగపడును. ఇది యంతయు చిట్టచివరకు క్రమ క్రమముగా, జారిజారి యేకుక్షి నిండుటకో వినియోగించును. "కోటి విద్యలు కూటికొఱకే". ఆంధ్రబడాయి పెండాలుతోను జెండాలతోను, అంతరింపక మనల నడిపెడి నాయకులకు నాలుగుప్పూట లింతఅన్నము పెట్టుటతో పూర్తియైన బాగుండును. వారికి ఆంధ్రుల యంతస్సు గోచరించును. అతిలోపముగానున్న అన్నదమ్ములభావము నణువంత యంకురింపజేయును. ఆర్యభూమి నవతరించిన ప్రాణులు ఏకోదరులను భావజ్యోతిని మన మనోవీథుల నుదయింపజేయును.

"అయితే అన్నముకొఱకు వీ రందరు వచ్చుచున్నారా?" అని యింకొక సందేహము. అన్నముకొఱకు వచ్చుటలేదు. కాని మనమే అందరను రమ్మని యాహ్వానించిన దోషమున నాహూతులగు నతిథుల కన్నముబెట్టుట సర్వసామాన్యమగు మర్యాద.

ఆంధ్రుల కింతమాత్రము మర్యాద తెలియదా ? ఆంధ్ర మహాజనులారా ? బహుపరాక్.

(సం.) ముగ్గిరాల గోపాలకృష్ణయ్య,
(6. డిశంబరు ౧౯౨౩)

శ్రీ దేశభక్తకొండ వెంకటప్పయ్యపంతులుగారు నిన్నటి పత్రికయందు ప్రకటించిన లేఖను గాంచితిని. ముందు వారిని

నిందాపరిహాసము గావించితి నను వాక్యమునకు సమాధానము జెప్పవలసియున్నది. శ్రీరామ! రామ! అటువంటి తాత్పర్యము నా కెన్నటికి లేదు. "అనరానివారినోట వినరానిమాట వింటి" నను విషాదముచే, సప్తాహసంకల్పము నాయకాగ్రేసరులగు శ్రీవారివలన బ్రప్రథమమున నాశీర్వాదము బొందనేరకపోయెనే యనుదుఃఖముచే, నాముక్కలు వ్రాసియుంటిని. వా రట్లభిప్రాయపడినచో, క్షమార్పణ వేడుకొనుచున్నాను. ఇక నా సరసోక్తులగూర్చియు, నాయొక్క ధర్మవిషయకాడంబరముఁగూర్చియు, శ్రీవా రనుగ్రహించిన యాశీర్వచనముల కేమిగాని, యీ ప్రయత్నములగూర్చి వారు గావించిన విమర్శనమునకుమాత్రము రెండుమూడుముక్కలు సమాధానముగ విన్నవించుకొనుచున్నాను. మున్ముందు అహమదాబాదులో జరిగినసంగతులగూర్చి శ్రీవారు వ్రాసినవాక్యములలో నయథార్థ మొకించుక గలదు. బొంబాయిక్రానికలుపత్రిక తొలుత జదివితి నని సెలవిచ్చిరి. అది వారి తంతి కనంతరమే చదివియుందురు. నేను అహమదాబాదుకు వెళ్ళిన యనంతరమే శ్రీవారి కా పత్రిక యందియుండెను. అంతకు మున్నే శ్రీవారి కా పత్రిక అందియుండెను. అంతకుమున్నే స్వరాజ్యపత్రికలు బహుశః చూచియుందురు. అపోహను గూర్చి వా రిచ్చిన తంతి సప్తాహ మసంభవమను మాటలతో ప్రచురింపబడెను. నా మనస్సునందున్న యాతురతచే నసంభవమను తాత్పర్యము విమర్శింప సాహసించితిని. సన్మానసంఘము వారితో బ్రస్తావించుటకు నే నందలిమెంబరు నై నను కాను. శ్రీవా రిందును

గూర్చి పౌరబా టభిప్రాయపడి, సన్మానసంఘ కార్యనిర్వా హక వర్గమునందు ప్రధానపురుషుడనై యుంటినని సెల విచ్చిరి. నాకట్టి ప్రాధాన్యమే సంక్రమించినయెడల దీనిని గూర్చి నిరంతరము విన్నవించుచునే యుండెడివాడను. అది లేని కారణముచేతనే "అచ్చటచ్చట ఎప్పుడెవ్వడో, ప్రస్తా వన చేయుట" శ్రీ వారును శ్రీ నాగేశ్వరరావుపంతులు గారును మొదలగు "పెద్దలతో ముచ్చటించుట" మొదలగు మార్గము ప్రాప్తించినది. విన్న పెద్దలును, ఇది యింత "ఘన కార్య" మని తలంచిన పెద్దలును ఉపేక్ష చేయుదురని నే నూహించియుండలేదు. ఈవిషయమై నేను జోక్యము కలుగ జేసుకొనుటకు మొనమొన్ననే నాకవకాశము దొరికి యుండు టచేత అవ్యవధిగానైన ప్రయత్నింప మొదలిడినాను. నాకు పట్టుదలయే లేదని సెలవిచ్చుట అన్యాయము. నాకవకాశ మిచ్చిన యాంధ్రగ్రంథాలయసభల, నిందునుగూర్చి తీర్మా నముగూడ జరిపించి యున్నాను. ఇక శ్రీవారు ప్రేక్షకుల గతి యేమని యాక్షేపించిరి. ప్రేక్షకులు మనము ప్రత్యేకించి పిలు వగా వచ్చెడివారు కారు. అందువలన నన్నదానముచే - ననా హూతు లగునతిథు లభ్యాగతులు గనుక వారినిగూడ నర్చింప వలసినదే. కాని శక్తిలేమిచే ఆ ప్రయత్నము సంకల్పింపబడ లేదు. ప్రతినిధులు మనయింటికి వచ్చెడి పెండ్లిపెద్దలా? యని, శ్రీవా రాక్షేపించినారు. వారు నిశ్చయముగ పెండ్లిపెద్దలే! ఈ సంవత్సర మాంధ్రిలక్ష్మికి కాకినాడయందు కళ్యాణోత్సవము జరుగనున్నది. కానిచో సన్మానసంఘము వారికి వలయు లక్షుణా

పాయలుకూడ యావత్ హిందూస్థానమున నేల వసూలుచేయ బడలేదు? కాంగ్రెసు కిచ్చిన ౧౦ రూ॥ ల కట్నములో సగము, వారి కిచ్చుచున్నమాట నిజమే! అది యాంధ్రులక్ష్మీకళ్యాణ సందర్భమున "సుమంగలీరియం" అని చదివింపబడు కట్నముగ భావింపబడవలెగాని, శ్రీవారి యభిప్రాయము యథార్థమైనచో, దామాషాప్రకార మీలక్షలో ఆంధ్రు లెంతయీయవలెనో అంతియే యీయవలెను. అతిథి కన్నసత్కారము లేదను వేదనతో పెండాలు వేయగా పిండాకూడు లేకపోయెనా?" అను ముక్కను వాడియుంటిని. అంతకన్న సరసమైన ముక్క యిప్పుడు చెప్పుతాను. బంగారపు పళ్లెరమువరకు ప్రయత్నముచేసి, 'ప్రసాదము మాత్రము లోపమండీ' అని చెప్పవలసివచ్చెఁగదా! పూర్వాచారములు అన్న విక్రయరూపముగా నున్నమాట వాస్తవమే! ఇప్పుడు మార్చగూడదా? మార్పుజేయు భాగ్య మాంధ్రులకు దక్కగూడదా? ఇది యన్నవిక్రయ మేలకాదు? అతిథియొద్ద మహాక్రతువున కాశీర్వచనపురస్సరముగ కట్నము గొందురుగాక, పెట్టినఖర్చు కన్న నెక్కువకట్నమే కొందురుగాక! అన్నము పెట్టినప్పుడు మాత్రము ఖరీదు తెమ్మని యడుగుట అనాంధ్రమును, అనార్యమును నయియున్నది. ఇది భావములోనే మార్పనుట నిజమే! (Change of heart) హృదయమునందు మార్పు కావలయునని మహాత్ములవారు నుడివినవాక్యమున కర్థమేమి?

"దానేన భూతాని వశీభవన్తి, దానేన వైరాణ్యపి యాన్తి నాశమ్..." అను నార్యోక్తి కర్థమేమి? అన్నదానము

మన మిపుడు చేసి "వెన్నువిరుచుకొన్న మాత్రాన" నార్య
భూమిలో దుర్నిమిత్తము లేవియు బయలుదేరవు. ఏదాన
మైనను సమర్థులు కావింపవలసియుందురు. అసమర్థుల మని
యాంధ్రమహాజనులందరు తీర్మానము గావించుకొన్నచో,
నన్నవిక్రియ పాతకము మన కంటక పోవచ్చునుగాని, అను
దినము సప్తాహములతో తాండవించుచున్న యాంధ్రలోక
మట్లు దైన్య మవలంబింప జనదని చెప్ప సాహసించుచున్నాను.

అఖిలభారత ప్రజాసంస్థయగు, కాంగ్రెసున కిందువలన
ముప్పు వాటిల్లనేర దని ముమ్మాటికి ఘంటాపథముగ జెప్ప
గలను. ఆంధ్రమహాజనులు తమయశస్సును నిష్కలంకముగ
కాపాడుకొందురుగాక. అతిథిసత్కారములపట్ల తమకు గల
యాదరణమును విడనాడ కుందురుగాక. ప్రపంచజ్ఞానము
జాటిన ధర్మస్వరూపము మరుగుపఱచుకొనకుందురుగాక!
ఆంధ్రమహాజనులారా! బహుపరాకు.

(సం.) దుగ్గిరాల గోపాలకృష్ణయ్య,
ఆంధ్రపత్రిక—౧౧-౧౨-౧౯౨౩.

BL

# శ్రీమదాంధ్ర విద్యాపీఠ గోష్ఠి,

## విజయవాడ.

శ్రీరామదాసు, ఆంధ్రరత్న, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారిచే రచియింపబడిన యీ దిగువ పుస్తకములు మావద్ద దొరకును.

| | | | |
|---|---|---|---|
| ౧. చాటువులు | 40 పుటలు | వెల | 0—3—0 |
| ౨. పురుషార్థములు | 122 పుటలు | | 0—8—0 |
| 3. శ్రీరామదండు | 81 పుటలు | | 0—8—0 |
| ౪. ఉపన్యాసములు | | | త్వరలో అచ్చగును. |

వలయువారు :—

గోష్ఠి పుస్తకాలయము,

బెజవాడ.

అని వ్రాయవలయును.

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA129B130 |
|---|---|
| పుస్తకం పేరు | శ్రీ రామదండు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | No |
| వెనక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | — |
| ఖాళీ పేజీలు | 4, 62B, ci, 82, BCI |
| లేని పేజీలు | i, ii |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ashwini |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |